
PARLE
POPPINS
Goli Rainbow Wali - Doon Kya?
Ram and Shyam
ఆకాశంలో పోరాటం


డా. మీన్ తన పరిశోధనశాలలో వినాశానాన్ని సృష్టించే మరో పన్నాగం పన్నుతుంటాడు.
ఆహా నా ప్రియమైన బర్డీ, ప్రపంచాన్ని కైవశం చేసుకునేందుకు నువ్వు నాకు సహకరిస్తావు.


పిల్లలు స్కూలుకు వెళ్తుంటారు అప్పుడు...


అక్! నా కారు! చిలిపి చిన్నారులు


అదిగో రాక్షస గ్రద్ధ రాళ్లను వేస్తుంది
అది మామూలు గ్రద్ధ కాదు, అది రోబొటిక్ గ్రద్ధ


పదా, మనం దాన్ని ఎదుర్కోవచ్చు.
కాని మనం ఆ పని ఆకాశంలో చేయాలి. మనం అది భూమి మీద వాలేంత వరకు వేచి ఉండకూడదు, అది అలా ఎప్పుడైనా చెయ్యొచ్చు.


పిల్లలు లైవ్ రుచి పాపిన్స్ తింటారు.
ఇవ్వనా? ఎగురు!


పిల్లలకు ఇప్పుడిక ఎగిరే శక్తి వస్తుంది. ఆకాశంలోకి ఎగురుతారు.
మనం ఒక్కొక్క రెక్కను పట్టుకుందాము
కావాలనుకుంటే నేను రెండు పట్టుకుంటాను.


పిల్లలు గ్రద్ధ రెక్కలు విరిచేస్తారు, అది భూమి మీద కుప్పకూలుతుంది.


మళ్ళీ గట్టి నేల మీదకి...
అంతా తేలికగా జరిగిపోయింది
కాని ఎక్కడో ఎవరో ఆకలితో ఉన్నారనిపిస్తుంది.


POPPINS

సంపుటి: 63 మార్చ్ 2010 సంచిక: 3

పేరు........................................ వయస్సు.......
చిరునామా...................................................
...................................................
...................................................
ఫోన్:................ ఇ-మెయిల్:...............................

## మీ మనసులో మాట చెప్పండి!

మీ అభిప్రాయాలను ఒక్కొక్క కథకు/శీర్షికకు నేరుగా ఉన్న గళ్ళల్లో టిక్ చేసి చుక్కలగీత గుండా కత్తిరించి మీ ఫీడ్‌బ్యాక్‌ను పోస్టు ద్వారా మాకు పంపండి.

అత్యుత్తమం ఉత్తమం బావుంది ఫరవాలేదు మామూలు

**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industries, Cross Road 'B',
MIDC, Andheri (East), Mumbai-400093.

T

# ఈ సంచికలో ...

## చందమామ

# సెలవులకు స్వాగతం పలుకుదాం

ప్రియ మిత్రులారా,

రోజులు క్షణాల్లాగా గడిచిపోయాయి కదూ! పరీక్షలు. మరోవైపు మనల్ని సంతోషపెట్టడానికి సెలవులు సిద్ధంగా ఉన్నాయి. హోలీని జరుపుకోనున్నందున మనం మార్చ్ నెలను రంగుల విరిజల్లులతో మొదలు పెడతాము. ఓ రకంగా ఈ పండుగ భారతదేశానికే ప్రాతినిధ్యం వహిస్తుంది. అత్యంత వైవిధ్యపూరిత మైన జాతులు, మతాలతో కూడిన విశిష్ట దేశం కదా మనది.

ఈ నెలలోనే 16న ఉగాదిని, 24న శ్రీరామ జయంతిని, 30వ తేదీన హనుమాన్ జయంతిని జరుపుకుంటాము. రామాయణం మన దేశ పరిస్థితులకు ఈ నాటికీ వర్తిస్తుంది. ఈరోజు కూడా ఆ గ్రంథం నుంచి మనం ఎన్నో నేర్చుకోవచ్చు. మనం ఈ నెలలోనే పలు అంతర్జాతీయ దినాలను కూడా జరుపుకుంటాము. అంతర్జాతీయ మహిళా హక్కుల దినం, అంతర్జాతీయ శాంతి దినం, అంతర్జాతీయ జాతి వివక్ష నిర్మూలనా దినం, ప్రపంచ జలదినం, ప్రపంచ వాతావరణ దినం, ప్రపంచ క్షయ నిర్మూలనా దినం, ప్రపంచ నాటకరంగ దినం.. ఇలా ఎన్నో.. ఎన్నెన్నో..

గతంలోనే వాగ్దానం చేసినట్లుగా, మేం ఆర్ట్ బుక్‌ను విడుదల చేయబోతున్నాము. వివిధ కాలాల్లో మన మేటి చిత్రకారులు గీసిన పలు చిత్రాల కలయికతో ఇది రూపొందుతోంది. అలాగే జానపద కథల పుస్తకం కూడా వేయబోతున్నాం. మీ ఊపిరి మరికాస్త బిగపట్టండి మరి.. సెలవులకోసమే ఓ వార్షిక సంచిక తెస్తున్నాం. దీనికోసం ముందే ఆర్డర్ చేసి ప్రత్యేక రాయితీ పొందవచ్చు.

సెలవులు సమీపిస్తున్నందున, మా చందాదారులను మరింతగా సంతోష పెట్టాలని భావిస్తున్నాం. ఈ నెలలో చందా కట్టినవారు చందమామ నుంచి ప్రత్యేక బహుమతిని పొందుతారు. మీరు ఇప్పటికే చందాదారులై ఉండి మరో సంచికకు అదనంగా చందా కట్టాలని అనుకుంటే మీరు ప్రత్యేక రాయితీ, బహుమతిని పొందుతారు. ఆశ్చర్యంగా ఉందా? అయితే వెంటనే కలం తీసుకుని చందా పత్రాన్ని పూరించడం మొదలు పెట్టండి!

పత్రికపై, మేం ప్రచురించబోతున్న పుస్తకాలపై మీరు పంపే అభిప్రాయాలను మేము తప్పక పరిగణనలోకి తీసుకుంటాము. ఈలోగా ఈ నెల కథల నిధి మిమ్మల్ని మరింత ఆనందంలో ముంచెత్తనుంది...

– సంపాదకుడు





మార్చ్ 2010 Rs. 20/-
*Founded by* **B. Nagi Reddi and Chakrapani**

***Editor & Publisher :*** Prashant Mulekar
***Associate Editors :*** Sowmya Rajendran, R. Vaasugi, A. Prem Kumar, K. Raja Sekhara Raju
***Senior Artists:*** K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
***Artist :*** T. Venkatesan
***Creative Writer :*** R. Rama
***Layout Designer :*** K. Narendra Raju
**Sanjay B Thorat :** ***Head - Sales and Circulation***
**CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Mobile +91 9821017787
email : sanjay.thorat@chandamama.com
**Rajendra K Jadhav :** ***Asst. Manager - Circulation***
Mobile +91 9320565048
email : rajendra.jadhav@chandamama.com
**Subhankar Rej,** ***Asst. Manager - Sales & Circulation (East)***
Email: subhankar.rej@chandamama.com
Mobile +91 9474916267
***Bengaluru :***
**CHANDAMAMA INDIA LTD.,** 18, 10th Cross, Mayura Street, Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage, Bangalore-560094,
Phone +91 80 6655 1000
***Chennai :*** **K. Ravishankar,** ***Sales Officer - Circulation,*** Mobile +91 98414 00981
email : ravishankar.k@chandamama.com
***Business Development :*** **Ananth Prakash**
Mobile +91 98362 82202, 98351 82202
email : ananth.prakash@chandamama.com
***Content Head - Online :*** **Sowmya Bharadwaj**
email : online@chandamama.com
***Marketing Enquiries :***
email : marketing@chandamama.com
***Advertisement :***
email : sales@chandamama.com
***Subscription Queries:***
e-mail : subscription@chandamama.com
***Customer Cell :*** A B Sairam
Mobile: +91 9841983774
e-mail : sairam.ab@chandamama.com
***Head Office :*** **CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

Printed and Published by Prashant Mulekar at Shruti Art Pvt. Ltd., Unit No.1, Gupta Mills Estate, Devidayal Industrial Compound, Darukhana, Reay Road (East), Mumbai - 400 010 on behalf of Chandamama India Limited, B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093. Editor : Prashant Mulekar

# పాఠకుల లేఖలు



నూతన సంవత్సర శుభాకాంక్షలతో చందమామ చాలా ఆకర్షణీయంగా ఉంది. ముఖ్యంగా అరవై సంవత్సరాలుగా ముఖచిత్రాలు వేస్తున్న చిత్రకారులందరి మనోభావాలను పుస్తకరూపంలో తీసుకువస్తున్నందుకు సంపాదకులు అభినందనీయులు. బేతాళ కథలు పిల్లలకు బాగా నచ్చుతున్నాయి. అలాగే పంచతంత్ర కథలు, రామాయణం అందరినీ ఆకర్షిస్తున్నాయి.

– పులిజాల రవీంద్రరావు, హైదరాబాద్.

నాగిరెడ్డి–చక్రపాణిల అపురూప, అందాల పత్రికను ఆరంభం నుండి (0.25పైసలనుండి రూ. 20లవరకు) ఈనాటి వరకు వెల భారంగా ఉన్నా, వయసు (79 ఏళ్ళు) మీరిపోయినా కొని చదువుతున్నాను. పాతకాలం వారికి నేటి మోడ్రనైజేషన్ నచ్చటం లేదు. జానపద, దయ్యం, భేతాళ, బ్రహ్మదత్తుడు వగైరా కథలను చదివి ఆనాడు మురిసిపోయాము. కాలగమనంలో ఆధునికీకరణ, హైటెక్ సిటీ, చంద్రయాన్, క్లోనింగులు.. ప్రపంచమే ఒక బొమ్మరిల్లు అయినప్పుడు పత్రికలో ఎన్నో మార్పులు చేర్పులు, ఎల్.కె.జి నుండే కంప్యూటర్‌లో పాఠాలు చెబుతున్న ఈ తరుణంలో చందమామలో మార్పులు సముచితమే.

– బొడ్డపాటి రాజేశ్వర మూర్తి, కృష్ణా జిల్లా.

గత యాభై ఏళ్లుగా చందమామ పాఠకుణ్ణి. కథలు గతానికి, ప్రాచీనత్వానికి, పురాణాలకు చెందినవిగా మాత్రమే ఉండాలి. నూతన పోకడలు, ఆధునిక కథాంశాలు వద్దు. ఇవి పిల్లలను, పెద్దలను ఆకర్షించలేవు. గతంలో వచ్చిన కథా సరిత్సాగరం, గాథాసప్తశతి, కాళిదాసు, తెనాలి రామలింగడు, మర్యాద రామన్న కథలు ప్రచురించండి. ఆధునిక ముఖ చిత్రాలు వేయవద్దు. చందమామకు పాఠకులే పన్నీరు. వారిని కట్టిపడేసేలా తీర్చిదిద్దాలి. 'చందమామ' చందమామలాగే వినీలాకాశంలో వెన్నెల చల్లదనాన్ని పంచాలి.

– జీ.బీ. విశ్వనాథ్ – గోరంట్ల, అనంతపురం

మీ అభిప్రాయాలను ఈమెయిల్
feedback@chandamama.com
ద్వారా పంపవచ్చు.



**Visit us at : http://Telugu.chandamama.com**



# సిద్ధార్థుడి గణితం

హేలాపురిలో గౌతముడు సామాన్య కుటుంబీకుడు. అతడికి ఇద్దరు పిల్లలు. కొడుకు సిద్ధార్థుడు ఆరేళ్ళవాడు. కూతురు పావనికి మూడేళ్ళు. సిద్ధార్థుడికి చాలా తెలివైనవాడని, చదువులో ఎంతో చురుగ్గా వుంటాడని పేరు.

ఒకనాడు సుగంధపురి నుండి, సిద్ధార్థుడి మేనమామ మాణిక్యం బావనూ, అక్కనూ, పిల్లలనూ చూసి పోదామనివచ్చాడు. ఆయన తమ ఊరి నుంచి జీడిమిఠాయి ఉండల్ని తెచ్చాడు. వాటిలో పది ఉండల్ని సంచీలోంచి తీసి సిద్ధార్థుడి కిచ్చి, తన మేనల్లుడి తెలివి తేటల్ని పరీక్షించాలన్న ఉద్దేశంతో, ''ఒరేయ్, సిద్ధార్థా! ఈ పది జీడి మిఠాయిల్లో సగం మీ చెల్లెలికిచ్చావనుకో! నీ దగ్గర ఇంకా ఎన్ని మిఠాయి ఉండలుంటాయి!'' అని అడిగాడు.

''ఏడుంటాయి, మామయ్యా!'' అన్నాడు సిద్ధార్థుడు తడుముకోకుండా.

తన మేనల్లుడు ఇంత చిన్న గణితం తప్పు చెబుతున్నాడేమని మాణిక్యం ఆశ్చర్యపోయి, ''సిద్ధార్థా, నే చెప్పింది నువ్వు సరిగా అర్థం చేసుకున్నట్టులేదు. నీ దగ్గరున్న పది మిఠాయిల్లో సగం–అంటే అయిదు మిఠాయిలు నీ చెల్లెకిస్తే, ఇంకా నీ దగ్గర ఎన్ని మిఠాయిలుంటాయి?'' అని వివరించి అడిగాడు మాణిక్యం.

''ఏడు మిఠాయిలుంటాయి, మామయ్యా!'' అన్నాడు సిద్ధార్థుడు చిరునవ్వుతో.

''ఛీ, వెధవా! నువ్వెంతో తెలివైనవాడివనుకున్నాను, నీకసలు లెక్కలేరావు,'' అన్నాడు మాణిక్యం చిరాగ్గా. ''లెక్కలు నాకు వచ్చు, మామయ్యా! మా చెల్లెలికేరావు,'' అన్నాడు సిద్ధార్థుడు అదే చిరునవ్వుతో.

మాణిక్యం తెల్లబోయినా, మేనల్లుడి తెలివితేటల విషయంలో తను విన్నది నిజమేనని గ్రహించాడు.

– కోనే నాగవెంకట ఆంజనేయులు






Sunday ఆదివారం रविवार Hindi రవివార్




## బేతాళ కథలు

# చంద్రన్న ఋణం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్నిదించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఎన్నో శ్రమలకోర్చి చేస్తున్న ప్రయత్నం, ప్రతి ఒక్కసారీ భంగపడుతున్నా సడలని నీ పట్టుదలా, ఓర్పూ నన్ను ఆశ్చర్యపరుస్తున్నవి. అనాలోచితంగా గానీ లేక జాలికొద్దీగానీ, ఏ అనర్హుడికైనా మేలు చేయదలచావేమో నాకు తెలియదు. యుక్తాయుక్తాలు తరచి చూడకుండా ఎవరికీ వాగ్దానాలు చేయకూడదు; అందువల్ల కొన్ని చిక్కులను కొని తెచ్చుకోవడం అవుతుంది. ఉదాహరణగా నీకు చంద్రన్న అనేవాడి కథచెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

శ్వేతాస్యుడనే గంధర్వరాజు వద్ద పనిచేసే భాగ్యనాధుడనే గంధర్వుడు సుప్రియ అనే అప్సరసను ప్రేమించాడు. ఆమె అతడికి ఒక అందమైన దంతపు పెట్టెనిచ్చి, ''దీన్ని శ్వేతా



స్యుడి కోశాగారంలోని విలువైన రాళ్ళతో నింపి నాకు తెచ్చియిస్తే, నేను నిన్ను పెళ్ళిచేసు కుంటాను,'' అన్నది.

భాగ్యనాథుడు, శ్వేతాస్యుడికి విషయం చెబితే, ఆయన కాసేపాలోచించి, ''నేను నిన్ను నా కోశాగారంలోని విలువైన రాళ్ళతో కొడుతూంటాను. ఎన్ని రాళ్ళ దెబ్బలు తిన గలిగితే అవన్నీ నీవి,'' అన్నాడు.

భాగ్యనాథుడు సరేన్నాడు కానీ మొదటి దెబ్బకే బాధ భరించలేక ఇక చాలన్నాడు. అప్పుడు శ్వేతాస్యుడు నవ్వి, ''నా సంపదను సులభంగా సామాన్యులపాలు చేయలేను. నీ ప్రేమ గొప్పదైతే, నేను తప్పక సాయపడి వుండేవాణ్ణి. నువ్వికి సుప్రియను మరిచి పోవడం మంచిది,'' అన్నాడు. ''నువ్వు నన్ను మోసం చేశావు. నా ప్రేమను పరీక్షించే పద్ధతి ఇదికాదు. నీ రాళ్ళు చేసే గాయాలను నేనే కాదు, ఏ ప్రేమికుడూ భరించలేడు,'' అన్నాడు భాగ్యనాథుడు ఎంతో బాధగా.

శ్వేతాస్యుడికి కోపం వచ్చింది. ఆయన వెంటనే, ''నీలో తప్పుంచుకుని, నన్ను మోస గాడినన్నావు. నేను నీ పెట్టెను విలువైన రాళ్ళతో నింపి యిస్తాను. దాన్ని వదిలించు కునేదాకా నీకీలోకంలో స్థానం లేదు. అసలైన ప్రేమికుడు కనిపించే వరకూ, నీకీ పెట్టె నుంచి విముక్తి వుండదు!'' అంటూ భాగ్య నాథుణ్ణి శపించాడు.

భాగ్యనాథుడాయన కాళ్ళ మీద పడి, ''ఈ శాపాన్ని నేను భరించలేను. నాకు విముక్తి మార్గం చెప్పు,'' అని వేడుకున్నాడు.

శ్వేతాస్యుడతడి మీద జాలిపడి, ''భూ లోకం ప్రేమమయం. అక్కడికి వెళితే, నీకు శాపవిముక్తి కలిగించగల గొప్ప ప్రేమికులు తొందరగా తటస్థపడతారు,'' అని చెప్పాడు.

భాగ్యనాథుడు పెట్టెతో సహా భూలోకానికి వచ్చి, బైరాగి వేషంలో అసలైన ప్రేమికుడి కోసం అన్వేషణ ప్రారంభించాడు. అలా తిరగ్గా తిరగ్గా అతడికి, జనకపురంలోని చంద్రన్న ప్రేమ గురించి తెలిసింది. ఈ చంద్రన్న, పొలం పనులు చేసుకునే రామన్న ఆఖరికొడుకు.

రామన్న రోజూ ఉదయమే లేచి పొలానికి వెళతాడు. ఇంటి దగ్గర ఆయన తండ్రి సోమన్న, తల్లి మంగమ్మ, భార్య రంగమ్మ పెరటిపని, వంటపనులు చూసుకుంటారు. రామన్న పెద్ద కొడుకు వీరన్న ఊళ్ళో కిరాణా



Sunday ఆదివారం ஞாயிற்றுக்கிழமை Tamil న్యాయిఱ్రు కిళమై

దుకాణం పెట్టాడు. అలా ఆ కుటుంబంలో అంతా ఏదో ఒకపనిచేస్తున్నారు కానీ చంద్రన్న మాత్రం పరమ సోమరి. పెద్దలు మందలించినా అతడు పట్టించుకోడు.

ఇలావుండగా పట్నంలో వుండే విశాలు డనే ఒక భాగ్యవంతుడు, వీరన్నకు తన కూతురు మల్లికనిచ్చి పెళ్ళి చేయాలనుకు న్నాడు. పిల్లను చూసేందుకు, రామన్న సకు టుంబంగా ప్రయాణమై విశాలుడింటికి వెళ్ళాడు. వీరన్నకు మల్లిక నచ్చింది. పెళ్ళికి ముహూర్తం కూడా నిశ్చయించారు.

అప్పుడే చంద్రన్న, మల్లిక చెల్లెలు మనో హరిని చూశాడు. అక్కకంటే అందంగా, చలాకీగావున్న ఆమె చంద్రన్నకు ఎంతగానో నచ్చింది. కానీ మనోహరికి, చంద్రన్న ఏపనీ పాటా లేకుండా తిరిగే సోమరి అని తెలియ డంతో, అతడికేసి తలతిప్పి చూడడం కూడా మానేసింది. దానితో చంద్రన్నకు చాలా రోషం వచ్చి, ఎలాగైనా ఆమెను పెళ్ళాడి తీరాలను కున్నాడు. అతడామెను ఒంటరిగా వున్న ప్పుడు పలకరించి, ''నిన్ను పెళ్ళాడాలని ఉన్నది, ఏమంటావు,'' అని అడిగాడు.

మనోహరి వెంటనే, ''నువ్వు నాకు కొత్త ఇల్లు కొనిస్తే, నిన్ను తప్పక పెళ్ళి చేసు కుంటాను,'' అన్నది తడుముకోకుండా.

''అలాగే, కొత్త ఇల్లు కొనిపెడతాను. అంతవరకూ నువ్వు ఇంకెవరినీ పెళ్ళిచేసుకో కూడదు,'' అన్నాడు చంద్రన్న.

''కొత్తఇల్లు కొనడానికెన్నాళ్ళు పడుతుందో చెప్పు,'' అన్నది మనోహరి.



చంద్రన్న ఒక్కక్షణం ఆలోచించి, ''ఇక్కడే వుండు. మా తాతనడిగి, నీ ప్రశ్నకు జవాబు తెలుసుకొనివస్తాను,'' అన్నాడు.

''నాకు ఇల్లు కొనడానికి, మీ తాత అను మతి కావాలా?'' అన్నది మనోహరి విసుగ్గా.

''అనుమతి కాదు, డబ్బు!'' అన్నాడు చంద్రన్న. ''నాకు ఇల్లు నీ డబ్బుతో కొనిపె ట్టాలి. మీ తాత, నాన్న, అన్న కష్టపడి సంపా యించిన డబ్బు వాళ్ళదౌతుంది. నువ్వు కష్ట పడి సంపాయించిన డబ్బు, నీదౌతుంది,'' అన్నది మనోహరి.

చంద్రన్నకు ఏమనాలో తెలియలేదు. అప్పటికి ఊరుకుని, అన్న పెళ్ళి జరిగాక వదిన మల్లికకు తనగోడు చెప్పుకున్నాడు.

చంద్రన్న చెప్పింది విని మల్లిక ఆశ్చర్య పడింది. మనోహరి అందాన్ని చూసి, ఇప్పటి



Sunday ఆదివారం रविवार Bengali রবিবার




వరకూ బాగా డబ్బున్న నలుగురు యువ కులు, పెళ్ళి చేసుకుంటామంటూ ముందు కొచ్చారు. వాళ్ళల్లో ఎవరూ ఆమెకునచ్చలేదు.

మల్లిక ఈ సంగతి చంద్రన్నకు చెప్పి, ''నా చెల్లెలికి డబ్బు మీద మోజులేదనే అనుకో వాలి. నిన్ను ఇల్లడిగిందంటే, నువ్వంటే ఆమెకు ఇష్టమైవుండాలి మరి. నా చెల్లెలిని పెళ్ళాడాలని వుంటే, నువ్వు కష్టపడి డబ్బు సంపాయించక తప్పదు,'' అన్నది.

ఇది విన్న చంద్రన్నకు ఎక్కడ లేని పట్టు దలా వచ్చింది. తనకు తానుగా డబ్బు సంపా యించడం ఎలా అన్న తీవ్రమైన ఆలోచనలో పడ్డాడు. సరిగ్గా ఆ సమయంలో, గంధర్వ భాగ్యనాధుడు బైరాగి వేషంలో వచ్చాడు. ఆయన వాళ్ళింట్లో సుష్టుగా భోంచేసి అంద రికీ శుభంకలగాలని దీవించాడు. చంద్రన్న తన గోడు ఆయనకు చెప్పుకున్నాడు.

బైరాగి అతడివంక ఆప్యాయంగా చూసి, ''ఆహా, నువ్వు నిజమైన ప్రేమికుడవని పిస్తున్నది. నా వెంటరా, నే చెప్పిన మూడు కష్టమైన పనులు చేయి. ఒకే ఒక్క రోజులో కోటీశ్వరుడివైపోతావు!'' అన్నాడు.

చంద్రన్న, బైరాగితో బయల్దేరి వెళ్ళాడు. వాళ్ళు ఊరుదాటి ఒక కొండగుహలో ప్రవే శించారు. లోపల అంతా చీకటి. బైరాగి అత డితో, ''నువ్విక్కడ పద్మాసనం వేసుకుని కూర్చో. ఆంజనేయుడి నామాన్ని జపించు. క్షణం కూడా నిద్రపోకుండా, ఒక రోజంతా అలాగే గడిపితే, అప్పుడు నేను వచ్చి పిలు స్తాను. కళ్ళు తెరు. తర్వాత ఏం చేయాలో అప్పుడు చెపుతాను,'' అన్నాడు.

చంద్రన్న వెంటనే దీక్ష ప్రారంభించాడు. అప్పుడతడికి ఏవేవో వికటాట్టహాసాలు విని పించాయి. అయినా చంద్రన్న భయపడలేదు. మర్నాడు బైరాగి వచ్చి కళ్ళు తెరవమనేదాకా చుట్టు పక్కల ఏం జరుగుతున్నదో అన్న స్పృహకూడా లేకుండా పోయింది.

చంద్రన్న కళ్ళు తెరిచాడు. వెంటనే ఆ గుహ ప్రకాశవంతంగా అయింది. ''శభాష్, చంద్రన్నా! ఇప్పుడు, ఎదురుగా గోడ మీద వున్న రాక్షసుడి బొమ్మ దగ్గరకు వెళ్ళు. ఆ బొమ్మ చెప్పినట్లు చేయి,'' అన్నాడు బైరాగి.

రాక్షసుడి బొమ్మ చాలా భయంకరంగా వుంది. చంద్రన్న నిర్భయంగా పోయి బొమ్మను సమీపించగానే, అది పెద్దగా నవ్వుతూ, ''నా



నోట్లో నీ కుడిచెయ్యి పెట్టు!'' అన్నది.

సంకోచించకుండా చంద్రన్న, పెద్ద గుహ లావున్న ఆ బొమ్మ నోట్లో తన కుడిచేయి పెట్టాడు. అంతే! బొమ్మ నోరు మూసుకుంది. చంద్రన్నకు తన చేతినెవరో కరకర నమిలేస్తున్నంత బాధకలిగింది; కానీ ఓర్చుకున్నాడు. కాసేపటికి బొమ్మ నోరు తెరిచి, ''నీ చేతికి ఒక తాళంచెవి తగులుతుంది. అది తీసుకుని నా బొడ్డులో పెట్టు,'' అన్నది.

చంద్రన్న తాళంచెవి తీసుకుని, బొమ్మ చెప్పినట్లు చేశాడు.వెంటనే గుహగోడ ఫెళ ఫెళమంటూ బద్దలైరెండుగా విడిపోయింది. బైరాగీ, చంద్రన్నా లోపలికి వెళ్ళారు. అక్కడ వాళ్ళకు, ఒక ఇనుపపెట్టె కనిపించింది. దాని తలుపు ఏ తాళమూ లేకుండా తాపడం చేసివుంది. అప్పుడు బైరాగి, చంద్రన్నతో, ''ఈ పెట్టెలో కోటి వరహాలువిలువ చేసే బంగారం, రత్నాలు, వజ్రాలు వున్నాయి. దీని తలుపు తెరుచుకోవాలంటే, నీవు అమితంగా ప్రేమించే వారి మీద ఒట్టువేసి, గుప్పెట బిగించి పెట్టెను బలంగా కొట్టాలి. ఆ ప్రయత్నంలో వేళ్ళు విరిగినా, రక్తం చిమ్మినా వెనుకంజ వేయకూడదు,'' అన్నాడు.

చంద్రన్న, మనోహరి మీద ఒట్టువేసి, గుప్పెట బిగించి పెట్టెను కొట్టాడు. మూత తెరుచుకోలేదు. అయినా అతడు నిరుత్సాహపడక పెట్టెను నాలుగైదు నిమిషాలపాటు కొట్టే సరికి, చేతివేళ్ళు దెబ్బతిని రక్తం కారసాగింది. అది చూసి, చంద్రన్న స్పృహతప్పి పడిపోయాడు. ఆ మరుక్షణం పెట్టె మూత



చటుక్కున తెరుచుకున్నది. అప్పుడు బైరాగి, భాగ్యనాధుడి రూపానికి మారి, చంద్రన్నను చేతితో తాకాడు. చంద్రన్నకు స్పృహవచ్చింది.

భాగ్యనాధుడు అతడివైపు ఆప్యాయంగా చూసి, ''నాయనా! నీ ప్రేమకారణంగా నాకు విముక్తిలభించింది. అందుకు ప్రతిఫలంగా, ఈ పెట్టెలోని సంపదంతా నీకిచ్చేస్తున్నాను,'' అంటూ తన కథను చెప్పాడు.

ఆశ్చర్యంగా, ఆ కథవిన్న చంద్రన్న పెట్టెలోకి తొంగి చూశాడు. అందులో బుసలు కొడుతున్న నాగుపాములు కనపడ్డాయి. ఈ సంగతి చెప్పగానే భాగ్యనాధుడు ఒక క్షణం ఆలోచించి, ''పెట్టె మూత తెరవ గలిగిన నీవు, నిస్సందేహంగా గొప్ప ప్రేమికుడివే. కానీ, నీవు ఎవరికో ఋణ పడివుండడంవల్ల, నీకీ సంపద కనబడడంలేదు. వెంటనే వెళ్ళి,



నీ కుటుంబ సభ్యులనందరినీ ఇక్కడికి తీసుకురా,'' అని చెప్పాడు.

కొద్దిసేపటికి చంద్రన్న వెంట కుటుంబ సభ్యులందరూ వచ్చారు. అయితే, ఒక్కరూ చంద్రన్న ఋణం గురించి చెప్పలేకపోయారు. భాగ్యనాథుడు వాళ్ళతో, ''మీరందరూ ఒక్కొక్కరుగా పెట్టెలోకి తొంగిచూడండి. చంద్రన్న కన్న గొప్ప ప్రేమికులెవరైనా వుంటే, వారికిందులోని సంపద కళ్ళబడుతుంది,'' అన్నాడు.

అప్పుడు ఒక్కొక్కరే వచ్చి పెట్టెలోనికి తొంగి చూసి వెళ్ళారు. అందులో బుసలుకొట్టే నాగులే కనబడ్డాయి. అయితే, చివరిగా చూసిన వీరన్నకు మాత్రం బంగారం, వజ్రాలు, రత్నాలు కనిపించాయి. భాగ్యనాథుడు, వీరన్నను మెచ్చుకుని, '' మీది ఉమ్మడి కుటుంబం గనక, ఈ సంపదంతా అందరికీ చెందుతుంది!'' అని చెప్పి అదృశ్యుడయ్యాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, చంద్రన్నకు మనోహరి పట్లవున్న ప్రేమను పరీక్షించేందుకు, భాగ్యనాథుడు అతడికి చాలా కఠోర పరీక్షలు పెట్టాడు. వాటిలో చంద్రన్న నెగ్గుకు వచ్చినట్లు స్పష్టమవుతున్నదిగదా? అలాంటప్పుడు పెట్టెలో అతడికి బుసలు కొట్టే పాములు కనబడడం, వీరన్నకు కోటి విలువ చేసే సంపదకనబడడం అసంబద్ధంగా లేదా? ఇందుకు గంధర్వుడేదో మాయాజాలం ప్రయోగించాడనుకోవాలా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ఈ జరిగినదాంట్లో అసంబద్ధతలకూ, గంధర్వ మాయాజాలాలకూ ఇసుమంత కూడా తావులేదు. ప్రేమించిన వ్యక్తి కోసం అవసరం అయితే ప్రాణత్యాగం చేయాలనుకునే సాహసికుల ప్రేమ కంటే, తన కుటుంబ బాధ్యతలను సక్రమంగా నిర్వహించే సామాన్యుడి ప్రేమ ఎన్నోరెట్లు గొప్పది. అందువల్లనే, పెట్టెలోని ఆ సంపద వీరన్నకు కనిపించింది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : ''వసుంధర'' రచన]



14

# ఆర్య

## మాణిక్య ద్వీప అన్వేషణ

చిత్రాలు: గాంధి అయ్య

తప్పిపోయిన పిల్లలను తిరిగి తెచ్చేందుకు గాను, మరిఘాను పట్టుకోవడంలో థార్విక్‌కు సహాయపడడానికి ధర్మపిత అంగీకరించాడు. తన మంత్రి ప్రభాత్ మాత్రమే నిజమైన థార్విక్ అని అతడు ఆర్యకు చెప్పాడు.

అతడు మీ బిడ్డే అయితే, మీరు నాకెందుకు సాయం చేస్తున్నట్లు?

నా పాప పరిహారం కోసం తప్పదు మరి.

నేను యువకుడిగా ఉన్నప్పుడు, మరెక్ తెగ మహిళతో ప్రేమలో పడ్డాను.

....మేమిద్దరం అన్యోన్యంగా జీవించాము. అయితే మా గణాలు ఒకటి కాదు. నేను బార్డ్ గణానికి చెందిన వాణ్ణే.

మీరు చెబుతున్నది నిజమా?

అవును. అప్పుడేం జరిగిందంటే నన్ను నా గణం నుంచి వెలివేశారు. ఆమెకూ అదే గతి పట్టింది.


దాంతో మేం స్వంత ఇళ్ళులాంటి అడవులను వదిలిపెట్టవలసివచ్చింది. క్లాతో పాటు ఆమె పెంపుడు పక్షి మాత్రమే మాకు తోడుగా వచ్చింది.


అయితే మేం ఒకరికి ఒకరం తోడుగా ఉండటమే గాక ఈ గుహల్లో కొత్త ఇంటిని కూడా కట్టుకున్నాం.
చాలా కాలం తర్వాత మాకు చక్కటి కూతురు పుట్టింది.
నా భార్య ఆమెకు సువర్ణద్వీప మాణిక్యం అనే అద్భుతమైన నజరానాను ఇచ్చింది.
ఆమెకు ఆ మాణిక్యం ఎలా వచ్చింది?
ఆమె తెగలోంచి వెళ్లిపోవడానికి ముందు తన తెగ పూజారిణి నుంచి దాన్ని దొంగిలించింది.


మాణిక్యాన్ని చర్మంలో దాచి ఉంచాలి కదా?
అవును. క్లాయే దాని సంరక్షకురాలు.
నేను ఆమెపై ఆగ్రహించాను. మాణిక్యం పవిత్ర వస్తువు. దానివల్ల ఏ మంచీ జరగదని నాకు తెలుసు. అయితే ఆమె మొండికేసింది.
నేనే తప్పూ చేయలేదు మరి.
నేను ప్రాధేయపడ్డాను, అర్థించాను. కానీ ఫలితం లేదు. చివరకు నేనే చేతులెత్తేశాను. అలా చేయకుండా ఉండాల్సిందనిపించింది.
అప్పటికే చాలా ఆలస్యం చేశావు.
ఆ రాత్రి, రాణి స్వప్నాల గురించి నిన్ను హెచ్చరించిన రుషి నా కలలోకి కూడా వచ్చాడు.
అతడి మాటలను నేనెన్నడూ తోసిపుచ్చలేదు. నా జీవితంకోసం నేను భయపడ్డాను. పిరికిపందలాగా, మారుమాటాడకుండా నేను గుహను వదిలి వెళ్లాను.


నేను దానికి గర్వించలేదు.
మరి నువ్వు నీ భార్యను, పసిబిడ్డను వదిలివేశావా?


నా పాపాలకు పరిహారం నిమిత్తం ప్రపంచాన్ని చుట్టేస్తూ, పేదలకు సహాయం చేస్తూ, రోగులను సేవిస్తూ గడిపేశాను.


అయితే నాకు శాంతి లేకుండా పోయింది. దాంతో, సంవత్సరాంతంలో, ఇంటికి తిరిగొచ్చాను.


అయితే వారు వెళ్లిపోయారు.


ఇంతకూ మీ కుమార్తె పేరేమిటన్నారు?
మరిఘా.
(ఇంకా ఉంది)



# రామాయణం

## ఉత్తరకాండ

శ్రీరామపట్టాభిషేకం చాలా రోజుల పాటు అందరికీ సుఖంగా గడిచింది. అనంతరం ఒకరొకరే వెళ్లి పోసాగారు. రాముడు అందరికీ తన కృతజ్ఞత తెలుపుకుని, తగిన విధంగా సత్కరించి సాగనంపాడు.

భరతుడు వెంట రాగా జనక మహారాజూ, లక్ష్మణుణ్ణి వెంటబెట్టుకుని కేకయమహారాజూ వెళ్లిపోయారు. భరతుడి ఆహ్వానం పైన వచ్చిన కాశిరాజు ప్రరత్థనుడూ ఇతర రాజులూ కూడా తమ తమ దేశాలకు తిరిగి వెళ్లారు.

రాముడి వెంట వచ్చిన వానరులూ, రాక్షసులూ రెండునెలల పాటు అయోధ్యలో సుఖంగా గడిపి వారు కూడా బయలుదేరారు. తనకు యుద్ధంలో తోడ్పడిన సుగ్రీవాంగద హనుమంతాదులను రాముడు సత్కరించాడు.

వానరుల్లో చివరి వంతు హనుమంతుడిది. వెళ్ళిపోతున్న సందర్భంగా రాముడిని హనుమంతుడు ఇలా కోరాడు, ‘‘ప్రభూ! నా వినతి మన్నించు. నిత్యమూ నీ భక్తుడిగా ఉంటూ నిన్ను కొలుచుకునేలా నన్ను ఆశీర్వదించు. ఇలపై రామకథా పారాయణం కొనసాగుతున్నంత వరకు నేను జీవించి ఉండేలా నన్ను కరుణించు.’’ హనుమంతుడు ఇలా కోరగానే రాముడు అతడిని ఆప్యాయంగా దగ్గ





Sunday ఆదివారం રવિવાર Gujarati रविवार



రకు తీసుకుని హత్తుకున్నాడు. ''హనుమా! ప్రజలు మా గాథ పారాయణం చేస్తున్నంత కాలం నీ కీర్తి దశదిశలా వ్యాపిస్తూనే ఉండు గాక. ఈ సృష్టి, ప్రపంచం ఉనికిలో ఉన్నంత వరకు నీవు చిరంజీవిగా వర్ధిల్లుదువుగాక.'' అని రాముడు ఆశీర్వదించాడు.

తర్వాత విభీషణుడికీ, అతని రాక్షసులకూ సన్మానాలు చేశాడు. వారందరూ బయలుదేరి కిష్కింధకూ, లంకకూ వెళ్ళి పోయారు.

అయోధ్యలో, అంతటా సుఖసంతోషాలు వెల్లివిరిశాయి. అలా రెండేళ్ళు గడిచాయి.

రాముడు సీతతో వనవిహారాలు చేస్తూ, మిత్రులతో గోష్ఠి జరుపుతూ కాలక్షేపం చేస్తూ వచ్చాడు. సీతలో గర్భచిహ్నాలు కనిపించాయి. రాముడామెతో, ''సీతా, నీవు తల్లివి కాబో తున్నావు గదా, నీకేమైనా కోరికలుంటే చెప్పు, తీరుస్తాను,'' అని ఒకనాడన్నాడు.

సీత చిరునవ్వుతో ముఖం వంచుకుని, ''నాకు గంగాతీరాన ఋషుల ఆశ్రమాలు చూసి, వారి కందమూల, ఫలాలు తిని, అక్కడి చెట్లకింద విహరించాలని ఉన్నది'' అన్నది.

రాముడు ''అలాగే చేతువుగానీ, ఈ రాత్రికి విశ్రాంతి తీసుకో. రేపే నిన్ను అక్కడికి పంపుతాను,'' అన్నాడు.

సీతతో ఈ మాట అని, రాముడు సభా మంటపానికి వెళ్ళాడు. అక్కడ విజయుడు, మధుమత్తుడు, కౌశ్యపుడు, పింగళుడు, కుటుడు, సురాజు మొదలగువారు హాస్య కథలు చెప్పి రాముడిని సంతోషపెట్టారు. రాముడు ప్రసన్నుడై భద్రుడనే వాణ్ణి చూసి, ''అయితే భద్రా, నా గురించీ, సీత గురించీ, నా తల్లులను గురించీ, తమ్ములను గురించీ ప్రజలు ఏమనుకుంటుంటారు?'' నా పరిపాలనలో, ప్రజలకు ఎలాంటి సమస్యలూ లేవుగదా? నిజం చెప్పు.'' అని అడిగాడు.

భద్రుడు చేతులు జోడించి, ''ప్రజలు అనేక రకాలుగా చెప్పుకుంటారు. వాళ్ళు జాస్తిగా మాట్లాడుకునేది రావణసంహారం గురించి,'' అన్నాడు.

భద్రుడేదో దాస్తున్నాడని రాముడికి అనుమానం వేసింది. ''భద్రా, ఉన్నమాట చెప్పు, మంచిదయినా, చెడ్డదయినా దాచకు,'' అన్నాడతను.

సముద్రానికి సేతువు కట్టావనీ, రావణుణ్ణి



Sunday ఆదివారం ৰবিবাৰ Assamese రొబిబార్

సమూలంగా నాశనం చేశావనీ ప్రజలు నిన్ను గొప్పగా చెప్పుకుంటారు. నిన్ను చూసి గర్వ పడతారు కూడా.

కాని, రావణుడు తన ఒడిలో కూర్చోబెట్టు కుని లంకకు తీసుకుపోయి, అంతకాలం తన అధీనంలో ఉంచుకున్న సీతను మళ్లీ తెచ్చుకున్న నీకు మంచి చెడ్డలు తెలియవం టున్నారు.

''రేపు తమ భార్యలకేమైనా జరిగినా తాము చచ్చినట్లు భరించవలసిందే గదా అంటు న్నారు. యథారాజా తథాప్రజా అన్నారు గద. ఎక్కడికి పోయినా జనం గుంపులు గుంపు లుగా కూడి ఈ మాటలే చెప్పుకుంటు న్నారు,'' అన్నాడు భద్రుడు.

రాముడు లోపల తీవ్రంగా బాధపడుతూ మిగిలిన మిత్రులతో, ''ఈ మాట నిజమేనా?'' అన్నాడు.

అందరూ తలలు వంచుకుని, నిజమేనని చెప్పారు.

రాముడు వారందరినీ పంపేసి, దీర్ఘాలో చనలో పడ్డాడు. తర్వాత సమీపంలో ఉన్న ద్వారపాలకుణ్ణి పిలిచి, ''లక్ష్మణుణ్ణీ, భరత శత్రుఘ్నులనూ పిలుచుకురా,'' అన్నాడు. త్వరలోనే వారు ముగ్గురూ రాముడి వద్దకు వచ్చారు. వారు రాముడి వదనం చూసి నిశ్చేష్టులయ్యారు.

కాంతి లేని ముఖంతో, కన్నులనీరు కారుస్తూ, రాముడు తన తమ్ములను ఆలిం గనం చేసుకుని, ఆసనాల మీద కూర్చోబెట్టి, వారికి సీత గురించి తాను పొందిన జనాప



వాదం గురించి తెలిపాడు.

''సీత నిర్దోషురాలని సూర్యచంద్రులు, అగ్ని, ఇంద్రాది దేవతలూ చెప్పారు. నా అంతరాత్మలో కూడా అలాగే అనిపించింది. లక్ష్మణా, ఇది నీ ఎదటే గదా జరిగింది? అందుచేతనే సీతను అయోధ్యకు తెచ్చాను. కానీ, సీతను ఈనాటికీ ప్రజలు ఆమోదిం చడం లేదు. ఆమెను శీలరహితురాలిగానే వారు భావిస్తున్నారు. ఈ అపవాదు భరిం చడం చాలా బాధగా ఉంది. రాజుగా దేనినైనా భరిస్తాను గాని, ప్రజలు సీతపై చేస్తున్న వ్యాఖ్యలు దుర్భరంగా ఉన్నాయి.

ప్రాణాలనూ మిమ్మల్నీ అయినా వదులు తాను గానీ అపకీర్తిని సహించలేను. సీతను విడవటమనగా ఎంత? ఈ అపవాదును



Sunday ఆదివారం ഞായർ Malayalam న్జయార్



మించిన దుఃఖం నాకు ఉండబోదు.

అందుచేత, లక్ష్మణా, రేపు తెల్లవారు జామున సీతను రథం మీద తమసానదీ తీరాన, వాల్మీకి ఆశ్రమప్రాంతంలో అరణ్యంలో వదిలిపెట్టిరా.

నా మాటకు ఎదురు చెప్పకు, సీతను గురించి ఏమీ అనకు. అంటే నాపైన ఒట్టే! సీత ఋషుల ఆశ్రమాలను చూడాలని కోరింది. ఆ కోరిక తీరుతుంది,'' అన్నాడు. రాముడు.

ఈ మాటలు చెప్పి అతను బాధగా నిట్టూర్పులు విడుస్తూ అంతఃపురంలోకి వెళ్ళిపోయాడు. ఆ రాత్రంతా రాముడు అంతఃపురంలో నిద్రలేని రాత్రి గడిపాడు.

మర్నాడు తెల్లవారుతూనే లక్ష్మణుడు సుమంత్రుడి వద్దకు వెళ్ళాడు. అతని వాలకం దీనంగా ఉన్నది. నోరెండిపోతున్నది. అతను సుమంత్రుడితో, ''సీతను మునుల ఆశ్రమాలకు తీసుకుపొమ్మని రాముడి ఆజ్ఞ అయింది. నేనూ, సీతా ఇప్పుడే బయలుదేరుతున్నాం. వెంటనే రథం సిద్ధం చెయ్యి. సీత కోసం రాజభవనం నుంచి మెత్తని ఆసనం తెచ్చి రథంలో అమర్చు,'' అన్నాడు.

సుమంత్రుడు రథాన్ని ఆయత్తం చేసి తేగానే లక్ష్మణుడు సీత వద్దకు వెళ్ళి, ''అమ్మా, ఆశ్రమాలు చూడాలని ఉన్నట్లు రాజుగారితో అన్నావుట. రాజుగారి ఆజ్ఞ అయింది. గంగా తీరాన గల ఆశ్రమాలకు పోదాం. బయలుదేరు. మా అన్న ఆజ్ఞప్రకారం నేను కూడా నీవెంట వస్తున్నాను,'' అన్నాడు.

సీత ఈ మాటలకు పరమానందం చెంది, వెలగల బట్టలూ, రత్నాలూ, ఆభరణాలూ మునిపత్నుల కోసం తీసుకుని లక్ష్మణుడి వెంట రథం మీద బయలుదేరింది. రథం వేగంగా పోతుంటే సీతకు దుశ్శకునాలు కనిపించాయి.

ఆ సంగతి లక్ష్మణుడితో చెప్పి, ''అత్తలూ వాళ్ళూ క్షేమంగా ఉన్నారు కద!'' అన్నది. లోపల గుండె గుబగుబ లాడుతున్నప్పటికీ, లక్ష్మణుడు పైకి నవ్వుతూ, ''వారంతా క్షేమంగానే ఉన్నారు,'' అన్నాడు.

రాత్రి అయేసరికి రథం గోమతీ తీర్థం చేరింది. ఆ రాత్రి అక్కడ గడిపి, తెల్లవారి బయలుదేరి, మధ్యాహ్నానికల్లా గంగాతీరానికి చేరుకున్నారు.

గంగను చూడగానే లక్ష్మణుడికి దుఃఖం ఆగలేదు. అది చూసి, ''ఇదేమిటి లక్ష్మణా? ఎందుకేడుస్తున్నావు? ఎంతోకాలంగా కోరుకున్న నా కోరిక తీరిందని నేను సంతోషిస్తుంటే, నీ దుఃఖంతో నా ఆనందాన్ని పాడు చేస్తున్నావెందుకు?

నన్ను వేగంగా గంగ దాటించి మునుల ఆశ్రమాలకు తీసుకుపో, మునుల భార్యలకు ఈ కానుకలన్నీ ఇస్తాను. అక్కడ ఈ రాత్రి గడిపి, రేపుదయం అయోధ్యకు తిరిగి పోదాం. రాముణ్ణి ఎప్పుడు మళ్లీ చూస్తానా అని నాకూ తహతహగానే ఉన్నది,'' అని సీత అన్నది.

లక్ష్మణుడు కళ్లు తుడుచుకుని దగ్గిరలో ఉన్న పడవ వాళ్లను పిలిచి, పడవ ఏర్పాటు చేసి, దాని మీద సీతతో సహా గంగ దాటాడు. రథంతో సహా సుమంత్రుడు అవతలి ఒడ్డునే ఉండిపోయాడు.

అవతలి ఒడ్డుచేరాక లక్ష్మణుడు సీతకు చేతులు జోడించి నమస్కారం చేస్తూ, ''సీతా మా అన్న నా గుండెలో శూలం గుచ్చేశాడు. ఇంత పాపిష్టి పనిచేసే కన్న నేను చచ్చిపోయినా బాగుండిపోను,'' అంటూ దుఃఖ వివశుడై కూలబడిపోయాడు.

సీత అతని స్థితి చూసి కంగారు పడి ''లక్ష్మణా, నీ మాటలు నాకేమీ అర్థం కావడం లేదు. నువ్వేదో ఉద్రేకంలో ఉన్నట్లున్నావు. నీ బాధకు కారణమేమిటో కాస్త స్పష్టంగా చెప్పు. లేకపోతే మీ అన్న మీద ఒట్టే!'' అన్నది.



అప్పుడు లక్ష్మణుడు సీతతో, ''అమ్మా, మా అన్న స్నేహితులతో కబుర్లు చెబుతూ నిన్ను గురించి భయంకరమైన లోకాపవాదులను విన్నాడు. ఆ అపవాదు నీ చెవుల పడరానిది.

దానితో మా అన్న కుమిలిపోయి నిన్ను వదిలిపెట్టేశాడు. నీ వల్ల ఏ దోషమూ లేదని మా అన్నకు తెలుసు, నాకూ తెలుసు. అయినా అపవాదుకు వెరచి ఇలా చేశాడు.

తల్లీ! నా పాపాన్ని క్షమించు. నిన్నిక్కడే విడిచిపెట్టి నేను అయోధ్యకు తిరిగి వెళ్లాలి. ఇది రాజాజ్ఞ. నువు మనస్సును అధికంగా కష్టపెట్టుకోక, పుణ్యప్రదమైన ఈ ముని ఆశ్రమంలో ఉండు. వాల్మీకి మహాముని మా



Sunday ఆదివారం रविवासर Sanskrit రవివాసరః

తండ్రికి ఆప్తస్నేహితుడు. ఆయనను ఆశ్రయించి సుఖంగా ఉండు.'' అన్నాడు.

ఈ మాటలు వినినంతనే సీత ఒక్క క్షణంపాటు మూర్ఛపోయినట్లైంది. తరవాత ఆమె తెప్పరిల్లి, దీనంగా ఏడుస్తూ, ''లక్ష్మణా, నేను కష్టాలు పడటానికే పుట్టాను. పూర్వ జన్మలో ఏదో పాపం చేసి ఉంటాను, ఏ దంపతులకో ఎడబాటు కలిగించి ఉంటాను.

అరణ్యవాసమప్పుడు రాముడు దగ్గిర ఉండి నన్ను ఓదార్చుతున్నా, నేను దుఃఖిస్తూనే ఉండేదాన్ని, అలాంటిది రాముడు వెంట లేని ఈ అరణ్యవాసం ఎలా ఉంటుందో ఆలోచించు. నా దుఃఖం ఎవరితో చెప్పుకునేది?

నిన్ను నీ భర్త ఎందుకు వదిలేశాడని మునులు అడిగితే ఏం చెప్పను? ఈ గంగా నదిలో పడి చావవచ్చు. కాని అందువల్ల మీ వంశం అపహాస్యం పాలు కావచ్చు. మీ అన్నగారి ఆజ్ఞ నిర్వర్తించావు.

ఇక నువు వెళ్లు, నాయనా, అత్తలందరికీ నా నమస్కారాలు చెప్పు, రాజుగారి క్షేమమడిగాననీ, ఆయనకు సాష్టాంగ నమస్కారాలు చేశాననీ చెప్పు.

ఆయనకు వచ్చిన అపవాదును పోగొట్టడం నా విధి. నేను పవిత్రురాలిని అని రాముడికి తెలుసు. తనకు తప్ప నా మనసులో మరెవ్వరికీ చోటు లేదన్న విషయం కూడా తెలుసు. కానీ రాజుగా తనమీదకు వచ్చి పడిన ఈ అపవాదును తొలగించడానికి నేను ఏ విధమైన త్యాగానికైనా సిద్ధంగా ఉన్నానని నా మాటగా రాముడికి చెప్పు.

ధర్మంగా రాజ్యపాలన చేస్తూ, తమ్ముళ్ళనూ, ప్రజలనూ ఒకే విధంగా చూస్తూ, లోకంలో సాటిలేని కీర్తి సంపాదించమని కోరానని, ఆయన మాటను గౌరవిస్తానని చెప్పు,'' అన్నది.

''లక్ష్మణా నీవు, నా భర్త రాముడి కన్నా ప్రియమైన వారు నాకు ఈ లోకంలో ఎవరూ లేరు. ఒక్కసారి నన్ను చివరిసారి చూసి, తిరిగి వెళ్ళు.'' అన్నది సీత.



# మిత్రభేదం-4

## దంతిలుడి కథ

దమనకం సంజీవకానికి దంతిలుడి కథ ఇలా చెప్పింది:

వర్ధమాన నగరంలో దంతిలుడు అనే ఒక గొప్ప వర్తకుడుండేవాడు. ఆయన నగర పాలకుడిగా ఉండి, నగరానికి సంబంధించిన విషయాలన్నీ చూసేవాడు.

ఆయన రాజుగారి సొంత ఖర్చు వెచ్చాలు కూడా చూసేవాడు. మెడమీది కత్తి లాంటి రాచరికపు వ్యయాలను పకడ్బందీగా నిర్వహిస్తూ, ఆయన అటు రాజుగారినీ, ఇటు ప్రజలనూ కూడా సంతోషపెట్టి, అందరి గౌరవమన్ననలనూ పొందుతూ వచ్చాడు.

రాజుకు హితుడైన వాణ్ణి ప్రజలు ద్వేషిస్తారనీ, రాజక్షేమానికీ, ప్రజాక్షేమానికీ వైరుధ్యం ఉండటం చేత ఉభయులనూ తృప్తిపరచటం చాలా అరుదనీ చెబుతారు. కాని దంతిలుడు అలాటి అరుదైన మనిషి.

ఒకప్పుడు దంతిలుడు తన కుమార్తె వివాహం జరిపాడు. దానికి ఆయన పౌరులనూ, రాజోద్యోగులనూ ఆహ్వానించి, విందు భోజనాలు పెట్టి, విలువైన బట్టలు పెట్టి పంపేశాడు.

వివాహం పూర్తి అయాక ఆయన వధూవరులను ఆశీర్వదించటానికి రాజునూ, ఆయన భార్యలనూ ఆహ్వానించాడు. వారు ఆహ్వానం అందుకున్నారు.

ముందుగా దివాణం నుంచి అనేక మంది ఉద్యోగులూ, నౌకర్లూ దంతిలుడి ఇంటికి వచ్చారు. వారిలో రాజుగారి ఇంట కసువు ఊడ్చేవాడు గోరభుడు అనేవాడు కూడా ఉన్నాడు.

గోరభుడు ఆస్థాన గౌరవమర్యాదలు పాటించక, రాజ పురోహితుడి కొరకు ఏర్పాటు





చేసిన ఆసనంలో వెళ్లి కూర్చుని లేవ నిరాకరిం చాడు. అర్హతకు అనువుకాని సత్కారాన్ని కోరటం పద్ధతి కాదని నచ్చ చెప్పినా వినక పోవడంతో దంతిలుడు వాణ్ణి బయటకు గెంటించాడు. తరవాత రాజు తన రాణులతో సహా వచ్చి, దంతిలుడు చేసిన సత్కారాలు పొందాడు.

దంతిలుడి ఇంట తనకు జరిగిన ఘోర మైన అవమానానికి ఉడికి పోతూ గోరభుడు ఆ రాత్రి నిద్రపోలేదు. వాడు ఇలా ఆలోచిం చాడు. ఈ అవమానానికి ప్రతిక్రియ ఏమిటి?

దంతిలుడిపై రాజుకు ఆగ్రహం తెప్పించి, అవమానం పాలు చెయ్యగలనా? లేక నేను ఏమీ చెయ్యలేక అవమానంతో కృశించి పోవలసినదేనా? గుండెల్లో నిత్యమూ రగిలే బాధను చూస్తూ నిస్సహాయంగా బతికే బతుకు వ్యర్థం!

పగ తీర్చుకోలేకుండా ఆగ్రహం చెందే వాడు సిగ్గుమాలిన వాడు. పెనం మీద వేసిన ఆవగింజ ఎంత ఎగిరిపడినా పెనాన్ని విరగ గొట్టలేదు. నేను కసువు ఊడ్చేవాణ్ణీ, ఆయన కోటీశ్వరుడూ, నగర పాలకుడూ; అయినా నన్ను అవమానించి ఆయన తప్పించుకు పోలేడని చూపిస్తాను. అని శపథం చేశాడు.

రాజుగారు పక్కవదలక ముందే ప్రతి రోజూ రాజుగారి శయనాగారం చిమ్మటం గోర భుడి పని. ఇది జరిగిన మర్నాటి ఉదయం రాజుగారు నిద్రలేచి, ఇంకా పక్కమీదనే ఉండగా, గోరభుడు గది చిమ్ముతూ, ''దంతి లుడు పెద్ద రాణీగారిని ఆలింగనం చేసు కోవడం ఎంత సాహసం!'' అని రాజుకు వినబడేలా గొణుక్కున్నాడు.

ఈ మాటలు విని రాజు చివాలున లేచి, ''ఒరే నువ్వు ఇప్పుడు గొణిగినది నిజమా? దంతిలుడు పెద్దరాణిని కౌగలించుకు న్నాడా?'' అని అడిగాడు.

''దొరా, రాత్రి పొద్దుపోయేదాకా పాచిక లాడుతూ మేలుకుని ఉండటం చేత, నిద్ర మత్తుతో జోగుతూ ఏమన్నానో నాకే తెలీదు,'' అన్నాడు గోరభుడు.

రాజు తనలో ''రాణులుండే గదులలోకి వెళ్లే పర పురుషులు దంతిలుడూ, ఈ గోర భుడూ మాత్రమే. అందుచేత దంతిలుడు పెద్దరాణిని ఆలింగనం చేసుకోవడం ఈ గోరభుడి కంట పడి ఉండవచ్చు.

నిన్న సాయంకాలం దంతిలుడు పెద్ద



రాణి పట్ల, మిగిలిన రాణుల పట్ల కన్న, హెచ్చు శ్రద్ధ చూపటమూ, ఆవిడ అతనితో కొంచెం హెచ్చు చనువుగా ఉండటమూ గమనించి అదంతా లాంఛన మనుకున్నాను. కాని వీడు అనే మాటలను బట్టి అందులో విశేషార్థం కనిపిస్తున్నది.

తాగుబోతుల నోటా, నిద్రపోయేవారి నోటా రహస్యాలు బయటపడతాయి. అనేకమంది భార్యలు ఉండటం చేత నేను పెద్ద రాణి పట్ల నిర్లక్ష్యంగా ఉంటున్న మాట నిజమే. అందు చేత ఆమె దంతిలుడి ప్రేమ కోసం ఆశపడి ఉండవచ్చు. నాకు ఎంత కష్టం వచ్చింది! అనుకుని దంతిలుణ్ణి రాజభవనంలో అడుగు పెట్టనివ్వవద్దని ద్వారపాలకులకు ఉత్తరు విచ్చాడు.

ఆ ఉదయం దంతిలుడు ఎప్పటిలాగే రాజభవనానికి వచ్చి, ద్వారపాలకులు తనను లోనికి పోనివ్వక పోవటం చూసి ఆశ్చర్యపడి ''నన్ను లోపలకు పోవద్దనటానికి మీకెన్ని గుండెలు!'' అన్నాడు.

''అయ్యా, మాపైన కోప్పడకండి. ఇది రాజుగారి ఉత్తరువు,'' అన్నారు వాళ్లు.

''రాజుగారి ఉత్తరువా? ఆయన అలాటి ఉత్తరువు ఒక్కనాటికీ ఇయ్యడు,'' అన్నాడు దంతిలుడు.

''సరేలెండి. రాజుగారికి మీమీద ఎందుకో చాలా కోపం వచ్చి ఉండాలి. ఆయన ఉత్త రువు ఇచ్చారు. దాన్ని పాలించటం మా విధా యకం,'' అన్నారు ద్వారపాలకులు.

రాజుగారికి తనపై కలిగిన అకారణ



క్రోధానికి దంతిలుడు నిర్ఘాంతపోయి తనలో ఇలా అనుకున్నాడు: ''డబ్బు రావటంతో గర్వించనివాడూ, భోగలాలసత వల్ల ఏదో ఒక చిక్కు రానివాడూ, రాజుగారి ప్రేమకు నిజంగా పాత్రుడైనవాడూ, చావును తప్పించుకున్న వాడూ, గౌరవం పొందిన యాచకుడూ ఉండ డని పెద్దలు చెబుతారు.''

''కాకిలో శౌచమూ, జూదరిలో నిజమూ, తాగుబోతులో వేదాంతమూ ఎవరు చూశారు? నేను రాజుకు గాని, రాజ బంధువులకు గాని కలలో కూడా ఎలాంటి అన్యాయమూ చేసి ఎరగనే, రాజుకు నాపై ఆగ్రహం ఏల కలి గింది?''

దంతిలుడు నిస్సహాయుడై నిలబడి ఉండటం చూసి గోరభుడు ద్వారపాలకులతో ''నన్ను ఈయనగారు నిన్న తన ఇంట్లోంచి

బయటికి గెంటేసినట్టే మీరు ఈయనగారిని ఇప్పుడు బయటికి గెంటండి,'' అన్నాడు.

ఇది విని దంతిలుడు, ఈ గోరభుడే దీని కంతకూ కారకుడని గ్రహించి, ఆ రాత్రి గోరభుణ్ణి తన ఇంటికి పిలిచి, వాడికి మేలైన బట్టలు పెట్టి, ''నాయనా, నేను నిన్ను పొగ రెక్కి అవమానించలేదు. రాజపురోహితుడి ఆసనం మీద కూర్చుని దిగమంటే దిగక, చేజేతులా అమానం తెచ్చిపెట్టుకున్నావు,'' అన్నాడు.

గోరభుడు తనకు పెట్టిన బట్టలు చూసి మహదానందం చెంది, ''ఆ అమానం అప్పుడే పోయింది లెండి. రాజుగారికి మీమీద మళ్ళీ అనుగ్రహం కలిగేటట్టు ఎలా చేస్తానో చూడండి.'' అని వెళ్ళిపోయాడు.

మర్నాడు ఉదయం రాజుగారు పక్కమీద మేలుకుని పడుకుని ఉండగా గోరభుడు గది చిమ్ముతూ, రాజ్యమేలే రాజుగారికి ఇంగిత జ్ఞానం లేదేం? దొడ్డికి వెళ్ళి దోసకాయలు తింటాడు! అని గొణిగాడు.

రాజుగారు ఆ మాట విని, గోరభుణ్ణి దగ్గరికి పిలిచి, ''ఎందుకురా మూర్ఖుడా అబద్ధాలాడుతున్నావు? మరొకడైతే అక్కడే వాడిని చంపేసి ఉందును. ఎంత కండకావరం? నేను దొడ్డికి పోయి దోసకాయలు తినగా నువు చూశావురా?'' అని అడిగాడు.

''తప్పుకాయండి దొరా, రాత్రి చాలా పొద్దుపోయిన దాకా పాచికలాడటం చేత నిద్రమత్తున ఏమన్నానో నాకే తెలీదు. క్షమించండి,'' అని పాత పాటే పాడాడు గోరభుడు.

ఒక్కసారిగా రాజుకు జ్ఞానోదయమైంది. వాడి మాటకు ఏమీ విలువ లేదని తనకు తెలిసిపోయింది. నిజంగానే దంతిలుడికి తాను చాలా అన్యాయం చేశాడు. అతను చాలా పెద్దమనిషి: ఎన్నడూ తప్పుడు పనులు చెయ్యనివాడు.

అదీగాక, దంతిలుణ్ణి ఒక రోజు రానివ్వక పోయేసరికి, దివాణం పనులూ, నగరం పనులూ అస్తవ్యస్తమయిపోయాయి. యధార్థం తేటతెల్లమవగానే రాజు దంతిలుణ్ణి పిలవనంపి, ఆయనకు మంచి బట్టలూ, కానుకలూ ఇచ్చి, ఎప్పటిలాగే పదవిలో ఉండనిచ్చాడు.



# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



NARAYANAMURTHY TATA

BALASUBRAMANYAM





**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.
పోటీ ఫలితాలు ఏప్రిల్ 2010 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100/- బహుమానం.

## అభినందనలు

బొబ్బా సత్యనారాయణ,
ఇం.నం.5-11-648,
ఆర్టీసీ కాలనీ,
నిజామాబాద్,
పిన్‌కోడ్: 503003
ఆంధ్రప్రదేశ్.

ఫోటో వ్యాఖ్యల పోటీ:





ముచ్చటతీరా మేపాలి
ప్రతి ఇంటి ముంగిటా ఆగాలి

## చందమామ లోకజ్ఞానం క్విజ్-12 జనవరి 2009 సమాధానాలు

1. 1857 2. అనీబెసెంటు 3. కేసరి 4. బి.ఆర్.అంబేద్కర్ 5. క్విట్ ఇండియా ఉద్యమం 6. అల్లెన్ ఆక్టేవియన్ హ్యూమ్ 7. జవహర్‌లాల్ నెహ్రూ 8. 24 ఊచలు

విజేతలకు అభినందనలు: ఎస్. స్వప్న, బీదర్; ఎస్. మానస హారిణి, మెట్‌పల్లి; తీర్థ శ్రీ, రంగారెడ్డి జిల్లా; పి.వి. పవన్‌కుమార్, నెల్లూర్; పి. షాన్వి, అమలాపురం.

Monday సోమవారం ସୋମବାର Oriya సోమబార

# వేగ సూత్రం



## ఈ నెల సమస్య:

బ్రిటన్‌కు రావటం శ్రేయకు ఇదే తొలిసారి. నెలసరి సరకులు కొనడానికి తను సూపర్ మార్కెట్‌కు వెళ్లింది. అక్కడ అన్ని సరకుల ధరలు కిలోలలో కాకుండా ఎల్‌బీలలో రాసివుండటం గమనించింది. ఆమె వద్ద వంద పౌండ్లు ఉన్నాయి. సరకుల మొత్తం ధరను లెక్కించడంలో ఆమెకు సహాయపడండి. ఆమె వద్ద ఎంత ఎక్కువ/తక్కువ నగదు ఉంది?

**శ్రేయ జాబితా:** బియ్యం-5 కిలోలు; నూడిల్స్-3 కిలోలు; కూరగాయలు-3 కిలోలు; వాషింగ్ పౌడర్- 2 కిలోలు; చికెన్-2 కిలోలు; యోగర్ట్-2 కిలోలు. **ధరల జాబితా:** బియ్యంః £2/lb; థాయ్ నూడిల్స్ః £1/lb; కూరగాయలు ః £4/lb; వాషింగ్ పౌడర్ ః £2/lb; చికెన్ ః £3/lb; పెరుగు ః £1/lb.

మీ వేగసూత్రాన్ని మార్చ్ 31వ తేదీ లోగా మాకు రాసి పంపండి. అత్యంత వేగవంతమైన సూత్రానికి బహుమతి రూ. 500. విజేతలు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్కరికి రూ. 100/- ఇవ్వబడుతుంది.

మీ ఎంట్రీలను పంపవలసిన చిరునామా:

**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industries, Cross Road 'B',MIDC, Andheri (East), Mumbai-400093
or e-mail your entries to:contests@chandamama.com

*గమనిక: ఈ సమస్యకు వేగవంతమైన వేదగణిత సూత్రం మే'10 సంచికలో ప్రచురించబడుతుంది.*

---

జనవరి నెల సమస్యకు సరైన సమాధానం:

నీలి రిబ్బన్‌ల సంభావ్యత:

నీలి రిబ్బన్‌ల మొత్తం/మొత్తం రిబ్బన్‌ల సంఖ్య

**= 34/34+29+29 = 34/92**

ఆకుపచ్చ రిబ్బన్‌ల సంభావ్యత:

ఆకుపచ్చ రిబ్బన్‌ల మొత్తం/మొత్తం రిబ్బన్‌ల సంఖ్య

**= 29/34+29+29 = 29/92**

రెండూ విడివిడి ఘటనలు కావున: **34 X 29/92**

దశ 1: రెండు సంఖ్యలను ఒకదాని కింద ఒకటి రాయండి:

**34**
**29**

దశ 2: దశాంశంలోని అంకెలను గుణించి, ఎల్‌హెచ్‌ఎస్ సమాధానాన్ని ఇలా రాయండి: **3 X 2 = 6**

దశ 3: క్రాస్‌వేలను గుణించి (**3 X 9** మరియు **2 X 4**), ఫలితాలను కూడిక చేయండి. **27+8 = 35.** మీ సమాధానానికి మొదటగా దీన్ని రాయండి. కానీ, తొలి డిజిట్‌ని ఇలా రాయండి $_{3}5$

దశ 4: అంకెలను యూనిట్లలో గుణించండి: **4 X 9 = 36.** దీన్ని మీ సమాధానపు ఆర్‌హెచ్‌ఎస్‌గా రాయండి. కానీ, తొలి డిజిట్‌ను $_{3}6$గా రాయండి.

మీ సమాధానం $6_{3}5_{3}6$ గా చదవాలి.

అంకెలకు ముందున్న క్యారీ ఓవర్స్‌ను ఇలా కలపండి. **6+3 = 9** మరియు **5+3 = 8.** ఈ విభాగపు తుది సమాధానం **986.**

**92** వర్గమూలం:

ఎల్‌హెచ్‌ఎస్ = **92 – (100**నుంచి **92** ను తీసివేయాలి**)**

**= 92 – 8 = 84**

ఆర్‌హెచ్‌ఎస్ = **100** నుంచి **92**ను తీసివేయగా వచ్చే అంకె యొక్క వర్గమూలం

$= 8^2 = 64$

కాబట్టి **92** వర్గమూలం **8464.**

కాబట్టి, నీలి, ఆకుపచ్చ రిబ్బన్‌ల సంభావ్యత=**986/8464.**

జనవరి నెల విజేత: కె. దాల్విక్, తం.పే. కె. శ్రీనివాసరావు, వైరా, ఖమ్మంజిల్లా, పిన్: 507165.

# కాగితపు రూపాలు

పేపర్ ఇంజనీరింగ్ గురించి సమగ్రంగా తెలుసుకోవడానికి ఈ సులువైన ప్రయోగాలు చేయడానికి ప్రయత్నించండి.





**ఏమేం కావాలి?**

- మందపు కాగితం
- బరువైన పెద్ద పుస్తకాలు

**తయారు చేయడం ఎలా?**



- కాగితం ప్రతిని వి ఆకారంలో మడిచి, దానిని అంచులపై నిలబెట్టండి.
- కాగితం పై భాగం మీద పుస్తకం ఉంచండి. పుస్తకం బరువును అది మోయగలుగుతుందా?
- కాగితం ఆ పుస్తకం బరువును మోయగలదు. అయితే మరింత బరువును జోడించినప్పుడు అది వంగిపోతుంది.



- మరొక కాగితాన్ని మడిచి కింద పెట్టండి. అప్పుడు అది అదనపు పుస్తకం బరువును మోయగలుగుతుంది. దీన్ని ఎన్ని రకాలుగా చేయవచ్చో ఈ పుటలోని బొమ్మలు చూస్తే తెలుస్తుంది.
- ఇలా కాగితాన్ని పలురూపాలలోకి మడిచి, ఏ రూపం బలంగా ఉండి బరువును మోయగలుగుతుందో చూడండి. ఇందుకోసం మీరు పుస్తకాలు కింద పడేవరకు కాగితపు షీట్లపై వాటిని పేర్చుతూ పోవాలి.

**కాన్సెప్ట్**

ఇది ఒక స్వరూపం యొక్క శక్తిని సంఘటితపరుస్తుంది. కొన్ని స్వరూపాలు మిగతా రూపాల కన్న బలమైనవని మీరు కనుగొంటారు. కాగితపు రూపాలు బరువుకు వంగిపోయేంతవరకు పుస్తకాలు పెడుతూపోండి. మీరు ఓ పోస్ట్ కార్డును (14సెం.మీ. x 9 సెం.మీ.) 9 సెం.మీ. ఎత్తు సిలిండర్‌గా మడవవచ్చు. దానిపై పుస్తకాలు మోపండి. పోస్ట్ కార్డ్ సిలిండర్ కుంగిపోకుండా 4 కిలోల పుస్తకాల బరువును తట్టుకోగలుగుతుంది. చెట్టు మొదలు అడ్డుకోత వృత్తాకారంలోనే ఉంటుంది తప్ప త్రికోణం లేదా చతురస్ర రూపంలో ఉండదని మీకు తెలుసా? ప్రకృతి ఓ అత్యుత్తమ డిజైనర్. ఇదే పెరిమీటర్‌లో వృత్తం అతి ఎక్కువ స్థలాన్ని ఆక్రమిస్తుంది. మానవుల కంటే ప్రకృతికే ఈ విషయం చాలాకాలం ముందే తెలుసు.

*రచన: అరవింద గుప్తా (పూణెలోని ఇంటర్-యూనివర్శిటీ సెంటర్ ఫర్ ఆస్ట్రానమీ అండ్ ఆస్ట్రో ఫిజిక్స్ భాగంలో విజిటింగ్ సైంటిస్టుగా పనిచేస్తున్నారు.)*



Monday సోమవారం সোমবাৰ Assamese సోంబార్

# చందమామ లోకజ్ఞానం క్విజ్-14

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

***Co-sponsored by FOUNDATION, Bangalore***

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు( 16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద **చందమామ లోకజ్ఞానం క్విజ్ - 14** అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. మార్చ్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి.
6. మే 2010 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## అంతరిక్ష విశేషాలు!




1. మన సౌరమండలం చుట్టూ ఎన్ని గ్రహాలు తిరుగుతున్నాయి?
2. సౌరమండలంలో అతి పెద్ద గ్రహం ఏది?
3. చంద్రుడిమీద నడిచిన తొలి వ్యోమగామి ఎవరు?
4. టెలిస్కోప్ ద్వారా చూసిన తొలి గ్రహం ఏది?
5. స్పేష్ స్టేషన్‌ను కలిగిన మొట్టమొదటి దేశం ఏది?
6. అంతరిక్షంలోకి ప్రయోగించిన మొట్టమొదటి ప్రాణి ఏది? దాని పేరు చెప్పండి.
7. సూర్యుడికి సమీపంలో పరిభ్రమించే గ్రహం ఏది?
8. సౌరమండలంలో సూర్యుడికి అతి దూరంలో ఉన్న గ్రహం ఏది?

## చందమామను ఇంటికి తెప్పించుకోండి!

న్యూస్ పేపర్ వేసే డెలివరీ మ్యాన్ ద్వారా రెగ్యులర్‌గా చందమామను తెప్పించుకోవచ్చు. స్థానిక న్యూస్ స్టాండ్స్ నుంచి, లీడింగ్ బుక్ షాప్స్ నుంచి చందమామను కొనుక్కోవచ్చు. చందా వివరాలకు **www.chandamama.com** లాగాన్ చేయండి.





Monday సోమవారం തിങ്കള്‍ Malayalam తింగళ్



# వాక్శుద్ధి




హరి, గిరి అనేవాళ్ళు, ఇరుగు పొరుగు ఇళ్ళల్లో వుంటున్న యువకులు. ఇద్దరికీ ఉద్యోగాల్లేవు. అయితే, ప్రవర్తనలో మాత్రం ఇద్దరికీ, ఏనుగుకూ, దోమకూ వున్నంత తేడా! హరి ఇంట్లో తల్లికీ, బయటి పనులలో తండ్రికీ సాయం చేస్తూంటాడు. ఊళ్ళోని పెద్దలకు మర్యాదయిస్తాడు. తన ఈడు వారితో ఎంతో స్నేహంగావుంటాడు. అందరూ హరిని మెచ్చుకుంటారు. తమ పిల్లలకు హరిలా వుండాలని తరచూ చెబుతూంటారు.

గిరి ప్రవర్తన హరికి పూర్తిగా భిన్నం. అతడు అడిగినా ఎవరికీ ఏసాయమూ చేయడు. పెద్దలను గౌరవించడు. పెద్దా చిన్నా అని లేకుండా అందరితోనూ గొడవపెట్టుకుంటాడు. అందరూ గిరిని తిట్టుకుంటారు. తమ పిల్లలకు గిరిలా వుండకూడదని చెబుతూంటారు.

తనకు చెడ్డపేరు వచ్చిందని గిరికి తెలుసు. అయితే అందుక్కారణం తన ప్రవర్తన అని అనుకోడు. హరి కారణంగానే తనకు చెడ్డ పేరు వచ్చిందని అందరితో అంటాడు. ఉత్త పుణ్యాన హరిని అవకాశం దొరికినపుడల్లా శాపనార్థాలు పెడతాడు.

ఇదంతా హరికి తెలుసు. అయినా అతడికి గిరిపట్ల కోపంలేదు. ఎవరైనా గిరి చెడ్డవాడని అంటే, ''అందరి ప్రవర్తనా ఒక్కలాగావుండదు. కానీ అంతా గిరిని నాతో పోల్చి చిన్నబుచ్చుతూంటారు. అందుకే అతడికి నామీద కోపం. లేకుంటే మేమిద్దరం మంచి స్నేహితులమే!'' అనేవాడు.

ఇలావుండగా, ఒకరోజున గిరి మేనమామ శంకరయ్య, ఆ ఊరువచ్చాడు. కాసేపు గిరితో మాట్లాడాక, ఆయన, ''బాబూ! నువ్వు చాలా తెలివైనవాడివి. మా ఊరు జమీందారుకు ఇద్దరు చురుకైన కుర్రాళ్ళు కావాలి. ఒకడు పనికీ, మరొకడు కబుర్లకీ. నువ్వేమో జమీందారుకు కబుర్లు చెప్పి కాలక్షేపం చేస్తే, మీ పొరుగింటి హరి పనులు చేసి పెడతాడు. జమీందారు, మీ ఇద్దరూ జంటగా వెళితే





హరికి మాత్రం రాకూడదు. అందుకే, జమీం దారు దగ్గరకు జంటగా వెళ్ళి ఉద్యోగమడ గడం, నాకిష్టం లేదు,'' అన్నాడు గిరి ఆవేశంగా.

''ఆ హరి ఎంతో మంచివాడు. అతడంటే ఎందుకురా నీ కంత కోపం?'' అని అడిగాడు శంకరయ్య. ''వాడు మాయగాడు. తను మంచివాడినని అందర్నీ నమ్మిస్తాడు. వాడితో పోల్చి అంతా నన్ను చెడ్డవాడనుకోవాలని వాడి ఉద్దేశ్యం. అందువల్ల, నేను పైకి వచ్చినా రాకున్నా వాణ్ణి మాత్రం పైకిరానివ్వను,'' అన్నాడు గిరి.

శంకరయ్యకు తన మేనల్లుడి ఓర్వలేని గుణం అర్థమైంది. ఆయన ఆ రోజే వెళ్ళి హరిని కలుసుకుని విషయం చెప్పి, ''మీ ఇద్దరికీ ఇది చాలా మంచి అవకాశం. నువ్వు ఎలాగో గిరికి నచ్చజెప్పే ప్రయత్నం చేయి,'' అన్నాడు.

ఇందుకు హరి సరేనని, ఆ సాయంత్రం గిరి వద్దకు వెళ్ళాడు. అతడు హరి చెప్పిం దంతా శ్రద్ధగా విని, ''ఆ జమీందారు మంచి వాడు కాదని, వాళ్ళూ వీళ్ళూ అనుకుం టూండగా విన్నాను. మనిద్దరికీ పని ఇచ్చినా, తర్వాత కొన్నాళ్ళకు నన్ను పనులు చేయ మంటాడు; నిన్ను కబుర్లు చెప్పమంటాడు. నేను పనులు సరిగ్గా చెయ్యడంలేదనీ, నువ్వు కబుర్లు సరిగ్గా చెప్పడంలేదనీ తిట్టడం మొదలు పెడతాడు. అందుకే ఆ ఉద్యోగాలు వద్దన్నాను,'' అన్నాడు.

''ఇదంతా నీ ఊహ అని నాకనిపిస్తున్నది. మరొకసారి బాగా ఆలోచించు,'' అన్నాడు

తప్పక ఉద్యోగాలిస్తాడు. ఆయన ఇచ్చే నెల జీతం కూడా ఎక్కువే వుంటుంది,'' అన్నాడు.

''నేను ఒక్కణ్ణీ వెళ్ళి అడిగితే, నాకు ఉద్యోగం ఇవ్వడా మీ జమీందారు?'' అని అడిగాడు గిరి. ''ఇవ్వడు! కబుర్లు చెప్పే వాడికి తనతో సమానంగా జీతమిస్తే, పని చేసేవాడికి అసంతృప్తిగా వుంటుంది. అలా గని కబుర్లు చెప్పేవాడికి తక్కువ జీతమిస్తే వాడికి అసంతృప్తి పుట్టి కబుర్లు సరిగా చెప్ప లేడు. అందుకని ఆ జమీందారు, ఇందుకు అభ్యంతరం చెప్పని జంటయువకులకే, ఈ ఉద్యోగాలిస్తాడు. మీ హరి చాలా మంచి వాడు. మీరు జంటగా వెళితే తప్పక ఈ ఉద్యోగాలు దొరుకుతాయి. వాటిలో మీరు తప్పక రాణిస్తారు,'' అన్నాడు శంకరయ్య. ''నాకుద్యోగం రాకున్నా ఫరవాలేదు కానీ,



హరి. ఇందుకు గిరి చిరాగ్గా, ''పోనీ, ఊహే అనుకుందాం. నాకు వాక్శుద్ధివుంది. నేనే మంటే అది జరుగుతుందని, మా ఇంట్లో అంతా అంటారు. వారం రోజుల క్రితం నాకు జున్ను తినాలనిపించి, ఇంట్లో పాలన్నీ విరిగి పోతే బాగుండునన్నాను. ఆ రోజు పాలు విరిగి పోయాయి. మూడు రోజుల క్రితం పెరట్లో మొక్కలకు నీళ్ళు పొయ్యమని అమ్మ బల వంత పెడితే, కాసేపట్లో వాన పడుతుందిలే అన్నాను. నిజంగానే వాన పడింది. ఇప్పుడు జమీందారు దుష్టుడు అన్నాను. ఆ మాటా నిజమే అవుతుంది. నా మాట నమ్ము,'' అన్నాడు. ''నీ ఊహ నిజమైనా కాకపోయినా, నాకు చాలా మంచి అవకాశం పోయిందని ఎంతో బాధగావుంది,'' అన్నాడు హరి.

''అవకాశం నాకూ పోయిందిగా! అయినా, నామూలంగా నీకు మంచి అవకాశం పోయిం దని నువ్వనుకుంటున్నావు. కానీ అది నిజం కాదు. నీకు ఇంతకంటే గొప్ప అవకాశం తొందరలో వస్తుంది. అప్పుడు నీవు ఈ అవ కాశం పోయినందుకు ఎంతగానో సంతోషి స్తావు. మళ్ళీ చెబుతున్నాను నా మాట నమ్ము. నాకు వాక్శుద్ధివుంది. నా మాట తప్పదు,'' అని గిరి తన ఉద్దేశ్యం చెప్పేశాడు. హరి ఇంకేమీ అనలేక తిరిగి వెళ్ళాడు.

అయితే, ఆశ్చర్యంగా మరి నాలుగు రోజులకు, హరికి దూరపు బంధువు కేశవుల నుంచి కబురొచ్చింది. కేశవులు పట్నంలో వుంటున్నాడు. ఆయన వ్యాపారాల ద్వారా, తరతరాలు తరగనంత ఆస్తిని సంపాదిం చాడు. ఆయనకు పిల్లలు లేరు. ఇప్పుడు ముసలివాడై పట్నంలో విశ్రాంతి తీసుకుంటు






న్నాడు. తన ఆస్తిని ధర్మకార్యాలకు విని యోగించాలని ఆయన కోరిక. అందుకు సమర్థుడు, మంచివాడు అయిన యువకుడు కావలసివస్తే, ఎవరో ఆయనకు హరి పేరు చెప్పారు. తన ఆస్తిలో నాలుగోవంతు హరి కిచ్చి, తను అతడి వద్దనే వుంటూ, మిగతా ఆస్తిని ధర్మకార్యాలకు వినియోగించాలని ఆయన కోరిక మేరకు హరి పట్నం వెళ్ళి ఆయన్ను కలుసుకున్నాడు. ఆయనకు హరి నచ్చాడు. తర్వాత హరి తన ఊరువచ్చి, తనీ స్థితికి చేరుకునేందుకు సాయపడినవారం దరికీ పేరుపేరునా కానుకలిచ్చాడు. వారిలో తలిదండ్రులు, అన్నదమ్ములు, గురువులు, మిత్రులువున్నారు కానీ గిరి లేడు.

గిరి అతణ్ణి కలుసుకుని, ''నా వాక్శుద్ధి వల్లనే నీకీ ఉన్నత స్థితికలిగింది. ఎంతో మంచివాడివని పేరు పొందిన నువ్వు, నా విషయం మరిచిపోవడం విచిత్రంగా వుంది,'' అన్నాడు. ఇది వింటూనే హరి చీదరింపుగా, ''నాకు ఉద్యోగంరాకూడదని, నీ ఉద్యోగావ కాశాన్ని కూడా వదులుకున్న దుష్టుడివి. నీకు నిజంగా వాక్శుద్ధివుంటే, నాకు మేలు జర గాలని కోరుకోవుగాక కోరుకోవు. వాక్శుద్ధి ఉండాలంటే, ముందుగా మనసు నిర్మలంగా వుండాలి. అది నీలో లేదు. ఆ పాలు విరగడం, వానకురవడం–ఒకటి నీ స్వార్థంకోసం, రెండోది పని తప్పించుకునేందుకు అన్నవే. మరొక సంగతి; తాను చెప్పిన చెడుపనులు జరిగి నట్టయితే, అలాంటివారిని వాక్శుద్ధి కలవారని చెప్పరు, నాలుకపై మచ్చగలవారని అంటారు!'' అని హరి ఆగాడు. గిరి వచ్చేకోపాన్ని బలవం తంగా ఆపుకుంటూ, ''ఆగావేం? ఇంకేమైనా వుంటే చెప్పు,'' అన్నాడు.

హరి అతడి ముఖంకేసి ఒకసారి పరీక్షగా చూసి, ''చెప్పడానికి చాలావుంది. ప్రస్తు తానికి కానుకల సంగతి. నీకు కానుకలిస్తే, అర్హత లేని వారిని సన్మానించినట్లే! అది నేను సన్మానించిన మిగతా వారికి చిన్నతనం. కాబట్టి నేను నీకోసం ఏ కానుకా తేలేదు,'' అన్నాడు.

ఈ జవాబుతో గిరి మారుమాట్లాడక తల వంచుకుని అక్కణ్ణించి మౌనంగా వెళ్ళి పోయాడు. – శ్రీరామ కమల్






Tuesday మంగళవారం செவ்வாய்க்கிழமை Tamil సెవ్వాయ్ కిళమై



# 25 ఏళ్ళనాటి చందమామ కథ

## పిల్లను తెచ్చిన ధనరాసి

సీనయ్య అనే ఆయనకు శంకరయ్య అనే కొడుకు ఉండేవాడు. సీనయ్యకు తన కొడుకు ఎందుకూ కొరగానివాడని నమ్మకం. అందు చేత ఆయన ప్రతిదానికీ వాణ్ణి శాసిస్తూ, కోప్పడుతూ వాడికి సొంత ఆలోచన అనేది సాధ్యం కాకుండా చేశాడు.

తండ్రిదే శాసనంగా పెరిగిన శంకరయ్య శుద్ధ వెర్రి వెంగళప్పగానే తయారయ్యాడు. పెరుగుతున్న కొద్దీ వాడి బుర్ర పూర్తిగా చెడింది. వాడికి సొంతాన నేర్చుకున్న విద్య ఒకటే తెలుసు. అదేమిటంటే, ఊరి చెరువులో మునిగి, ఊపిరి బిగబట్టి, చాలాసేపు కూర్చోవటం. తండ్రి అదుపు లేకుండా వాడు ఈ విద్య అద్భుతంగా నేర్చుకున్నాడు. తండ్రి ఏ పని చెప్పినప్పటికీ వాడు దాన్ని ఏదోవిధంగా పాడు చేసేవాడు.

కొడుక్కు పెళ్ళి చేస్తే వాడికి తెలివి తేటలు వస్తాయేమోనన్న ఒక్క ఆశ సీనయ్యను వదల లేదు. సీనయ్యకు భార్యలేదు గనక, కోడలు వచ్చి తనకు ఇంటిపని చూసుకునే బాధ తప్పిస్తుందన్న ఆశకూడా ఉన్నది. అయితే, గ్రామంలో ఎరిగిన వాళ్ళెవరూ శంకరయ్యకు పిల్లనివ్వటానికి ఒప్పుకోలేదు.

ఇలా ఉండగా పొరుగూరిలో ఒకసంబంధం ఉన్నట్టు తెలిసింది. సీనయ్య తన కొడుకును పెళ్ళి చూపులకు తీసుకుపోతూ, అక్కడ ఎలా మసులుకోవాలో వివరంగా చెప్పి, ''ముందు వెళ్ళుతూనే చెప్పులు తలుపు వెనక విడిచి, నువ్వు కుర్చీ మీద కూర్చో, తెలిసిందా?'' అన్నాడు. శంకరయ్యకు తండ్రి ఏది చెప్పినా ఉన్న మతి కూడా పోతుంది. అయినా వాడు, తెలిసిందన్నట్టు తల ఆడించి, తండ్రి చెప్పిన మాటలు మళ్ళీ మళ్ళీ అనుకుంటూ, బండిలో ఎక్కి కూర్చున్నాడు. కాని దారిలో ఆ మాటలు





Tuesday మంగళవారం মঙ্গলবার Bengali మంగళ్‌బార్



తారుమారయ్యాయి. తీరా ఊరు చేరి, పెళ్ళి కూతురు ఇల్లు చేరి, శంకరయ్య తన చెప్పులు తీసి కుర్చీ మీద పెట్టి, తాను పోయి తలుపు వెనకాల కూర్చున్నాడు.

పిల్ల తండ్రికి శంకరయ్యను చూడగానే అంతా అర్థమయిపోయింది. ఆయన వారికి పిల్లనైనా చూపకుండా, ''ఈ వెర్రిబాగుల సంబంధం మా కొద్దు,'' అని వారిద్దరినీ వచ్చిన దారినే పంపేశాడు.

ఇంటికి వచ్చాక సీనయ్య శంకరయ్య మీద విరుచుకు పడి, ''ఇక నీకీ జన్మలో పెళ్ళి కాదు. తలమాసిన వాడెవడైనా నీకు పిల్లనిస్తే ఇయ్యాలి!'' అని కసురుకున్నాడు.

తనకు పిల్లనిచ్చే తలమాసిన వాణ్ణి వెతకటానికి శంకరయ్య నిశ్చయించాడు. ఆ రాత్రికి రాత్రే వాడు ఇంటి నుంచి బయలుదేరాడు.

వాడు మూడు రోజులు ప్రయాణం చేసి నాలుగో రోజు చీకటిపడే వేళకు ఒక కొండ ప్రాంతానికి చేరాడు. అక్కడ ఒక గుహలో నుంచి విచిత్రమైన ధ్వని వాడికి వినిపించింది. ఆ గుహలో ఒక రాక్షసుడు నిద్ర పోతున్నాడు. వాడు పెడుతున్న గురకే శంకరయ్య విన్నది.

శంకరయ్య లోపలికి వెళ్ళి, రాక్షసుణ్ణి చూసి, వాడి జుట్టు మట్టికొట్టుకుని, మాసి నట్టుండటం గమనించాడు. ''నాకు పిల్లనిచ్చే తలమాసినవాడు. నేను వస్తున్నానని తెలిసి భయపడి ఇక్కడ దాక్కున్నాడన్నమాట!'' అనుకుని శంకరయ్య ఆ రాక్షసుణ్ణి జుట్టు పట్టుకుని ఊపాడు.

రాక్షసుడు పెద్దగా ఆవలిస్తూ లేచి, ''ఎవడురా నన్ను లేపిందీ?'' అని కోపంగా గర్జించాడు. ''పిల్లనివ్వకుండా ఎటు పోతావురా, తలమాసిన వెధవా? వెంటనే కట్నంతో సహా నాకు పిల్లనిచ్చి పెళ్ళి చెయ్యి,'' అంటూ శంకరయ్య రాక్షసుడి చెవి మెలిపెట్టాడు.

రాక్షసుడికి పట్టరాని కోపం వచ్చింది. వాడు ఆ కోపంలో శంకరయ్యను విరుచుకు తినేవాడే. కాని ఈ లోపుగా, గుహ లోపలి గుహలో ఉన్న రాక్షసుడి పెళ్ళాం, శంకరయ్య అన్న మాటలు విని ఇవతలికి వచ్చింది. ఎందుకంటే, దానికొక కూతురు ఉన్నది. ఆ పిల్లది చాలా స్థూలకాయం. ఎంత ప్రయత్నించినా దానికి ఈనాటి వరకూ సంబంధం కుదరలేదు. అందుచేత రాక్షసి ఇవతలికి వస్తూనే, ''ఏం రాక్షసుడివయ్యా నువ్వా? అల్లుడు వస్తే ఒక మర్యాదా, మంచీ లేదూ!''

అంటూ తన మొగుడి మీద విరుచుకు పడింది. ''ఇంతకూ పిల్ల ఏదీ?'' అంటూ శంకరయ్య చుట్టూ చూశాడు.

''ఇప్పుడే విహారానికి వెళ్ళింది. ఇంకో ఝాముకుగాని తిరిగిరాదు. చాలా దూరం ప్రయాణించేసి వచ్చినట్టున్నావు. బాగా అలిసి వచ్చావు, ఇంత తిని హాయిగా ఒక కునుకుతియ్యి,'' అన్నది రాక్షసి.

శంకరయ్య రాక్షసి పెట్టిన పళ్లు తిని, పాలు తాగి, లోపలి గుహలో జంతువుల చర్మాల మీద శయనించాడు. శంకరయ్య పుష్టి అయినవాడు. వాణ్ణి తినాలని రాక్షసుడికి కోరికగా ఉన్నది. కాని రాక్షసి శంకరయ్య పడుకున్న గుహకు అడ్డంగా కూర్చున్నది.

రాక్షసికూతురు అర్ధరాత్రికి వచ్చింది. అది చేసిన అడావుడికి శంకరయ్య మేలుకుని, తల్లీ కూతుళ్ళ సంభాషణ విన్నాడు. ''ఇన్నాళ్ళకు మొగుడు నిన్ను వెతుక్కుంటూ వచ్చాడే,'' అన్నది తల్లి-రాక్షసి చాలా సంతోషంగా. ''ఎక్కడ? ఎక్కడ?'' అంటూ కూతురు రాక్షసి శంకరయ్య పడుకున్న గుహలోకి తొంగి చూసింది.

కళ్ళు కొంచెంగా తెరిచి రాక్షసి కూతుర్ని చూసి శంకరయ్య అదిరిపడ్డాడు. అది తల్లి దండ్రుల కన్న కూడా వికారంగా ఉన్నది.

శంకరయ్యను చూసి రాక్షసి కూతురు, ''వెన్నపూస లాగున్నాడు!'' అన్నది.

''వాణ్ణి విరుచుకు తింటావా ఏం? ఆ పని మాత్రం చెయ్యకు. వీడు తప్పితే నీకు మరొక మొగుడు దొరికే అవకాశమే లేదు,'' అని తల్లిరాక్షసి కూతుర్ని హెచ్చరించింది.

''నా మాట సరే. అయ్య మాటేమిటి?



మనిషి దొరికితే తినకుండా వదలదు,'' అన్నది కూతురు. ''అందుకే నేను బయటికి కూడా పోకుండా కాపలా కాస్తున్నా. నేను కాస్సేపు అలా తిరిగి వస్తా. నువ్వు కాపలా కూర్చో,'' అని తల్లి రాక్షసి బయటికి వెళ్ళిపోయింది.

రాక్షసి కూతురికి శంకరయ్యను చూస్తున్న కొద్దీ తినాలన్న కోరిక పెరగ సాగింది. గుహ లోనే తినేస్తే తల్లి తనను బతకనివ్వదు. అందు కని రాక్షసి కూతురు శంకరయ్యను నిద్రలేపి, ''పెళ్ళి ఏర్పాట్లన్నీ అయ్యాయి. పద పోదాం,'' అన్నది. అంతా వింటున్న శంకరయ్యకు దాని దొంగఎత్తు అర్థమయింది.

''ముందు కట్నం డబ్బు అక్కడ పెడితేనే పెళ్ళి!'' అన్నాడు వాడు.

రాక్షసి కూతురు లోపలికి వెళ్ళి, ఒక తోలు సంచీ నిండా రత్నాలూ, బంగారమూ తెచ్చి, శంకరయ్య చేతికిచ్చి, పదమన్నది.

శంకరయ్య సంచీ మూతికట్టి భద్రంగా చంకన పెట్టుకుని, రాక్షసి కూతురి వెనకనే బయలుదేరాడు. గుహ దాటి ఇవతలికి రాగానే వాడు రాక్షసి కూతురితో, ''స్నానం చెయ్యకుండా పెళ్ళి ఏమిటి? ముందు స్నానం చెయ్యాలి,'' అన్నాడు.

రాక్షసి కూతురు వాణ్ణి ఒక కోనేరు దగ్గరికి తీసుకుపోయింది. వాడు సంచీతో సహా కోనేరులోకి దూకి, అడుగున కూర్చున్నాడు.

రాక్షసి కూతురు ఎంతసేపు చూసినా వాడు మళ్ళీ పైకి రాలేదు. దానికేమో నీరు అంటే చచ్చే భయం. వాడు మర్నాడు చచ్చి పైకి తేలుతాడనీ, అప్పుడు తాను వచ్చి వాణ్ణి పీక్కు తినవచ్చుననీ అనుకుని అది తమ గుహకు తిరిగి వెళ్ళింది.

తరవాత శంకరయ్య తల నీటి పైకి పెట్టి, రాక్షసి కూతురు పోయిందని తెలుసుకుని కోనేటి నుంచి వెలుపలికి వచ్చి సంచీతో సహా ఇంటికి తిరిగి వచ్చాడు.

డబ్బుతో తిరిగి వచ్చిన శంకరయ్యకు మంచి సంబంధం దొరికింది. తన అదుపు లేకపోతే తన కొడుకు వెర్రి వెంగళప్ప కాడని సీనయ్య అప్పటికి గ్రహించాడు. ఆ తరవాత శంకరయ్య తాను యోగ్యుడే నని రుజువు చేసుకోడానికి ఎంతో కాలం పట్టలేదు.







Tuesday మంగళవారం ମଙ୍ଗଳବାର Oriya మంగళబార



# అత్తాకోడళ్ళ పోరు




ఏ ముహూర్తాన అరుంధతి అత్తవారింట అడుగు పెట్టిందోగాని, ఆమెకూ, అత్త ఆండాళ్ళమ్మకూ క్షణం పడేదికాదు. అత్త ఎడ్డెమంటే, కోడలు తెడ్డెమనేది. ఎప్పుడైనా మనసుపడి కోడలు కొత్త చీర సింగారించి శిగలో పూల చెండు తురుముకుంటే, ఆండాళ్ళమ్మకు మనసు ఒప్పేదికాదు. ''ఏమిటీ వీధిమనిషి వేషాలు? అసలిది సంసారుల కొంపేనా!'' అని ఈసడించేది.

'నేను సింగారించుకుంటే, కళ్ళల్లో నిప్పులు పోసుకుంటావెందుకు?'' అని అత్తను ఎత్తి పొడిచేది అరుంధతి. ఏరోజైనా ఆండాళ్ళమ్మ తోటకూర తెచ్చి తియ్యగూర చెయ్యమంటే, నీ కొడుక్కు పుల్లగూరే ఇష్టమని–పెడసరంగా బదులిచ్చేది అరుంధతి.

రోజంతా పొలంలో కష్టపడి పని చేసి, చీకటి పడేవేళకు ఇంటికి తిరిగి వచ్చే అమరయ్యకు, ఈ అత్తాకోడళ్ళ పోరుతో మనశ్శాంతి లేకుండా పోయింది. సాధుస్వభావంగల అతను, అటుభార్యకు గాని, ఇటు తల్లికిగాని సర్ది చెప్పలేక సతమతమై పోయేవాడు.

ఒక రోజు సాయంకాలం, ఇంటికి తిరిగి పోవడానికి మనసురాక, అమరయ్య పొలం గట్టు మీద విచారంగా కూర్చున్నాడు. అంతూ పొంతూ లేకుండా ఎటైనా పారిపోవడమా లేక సన్యాసుల్లో కలిసి పోవడమా అని ఆలోచిస్తున్న అమరయ్యను, ఆ దారి వెంట వెళుతున్న అతడి మిత్రులు రామయ్య, భీమయ్య చూసి దగ్గరకు వచ్చి, ''ఏమైంది? కొత్తగా పెళ్ళయిన వాడివి ఇట్లా దిగాలు పడి, ఇంటికి పోకుండా ఇక్కడ కూర్చున్నావేమిటి?'' అని అడిగారు.

అమరయ్య, వాళ్ళకు తన పరిస్థితి వివరించి, ''సరే, అంతా నాఖర్మ! అనుభవించక తప్పదు కదా. అది సరే, ఇప్పుడు మీ ప్రయాణం ఎక్కడిదాక?'' అని అడిగాడు. అందుకు వాళ్ళు, ''పొరుగూరులో నాటకాలాడుతున్నారు. వేషంకట్టడానికి వెళుతున్నాం. త్వరలో శ్రీరామ నవమి వస్తున్నది కదా!'' అన్నారు.

ఆ తర్వాత రామయ్య, భీమయ్యలు కాసేపు అమరయ్యతో అవీయివీ మాట్లాడి, ''నువ్వేమీ దిగులు పెట్టుకోకుండా ఇంటికి వెళ్ళు. త్వరలోనే నీ సమస్య పరిష్కారమై పోతుందిలే!'' అన్నాడు రామయ్య. ''అవును, రామయ్య మాటకు తిరుగు లేదు మరి!'' అంటూ భీమయ్య గట్టిగా నవ్వాడు.

ఒక వారం గడిచింది. ఆ రోజు నిండు పున్నమి. అమరయ్య గాఢనిద్రలో వున్నాడు. పెరట్లో నూతి దగ్గర ఏదో గలగలమంటూ పెద్దగా శబ్దం వినిపించింది. అత్తాకోడళ్ళిద్దరూ ఉలిక్కి పడి లేచి కూర్చుని, ఏమిటా శబ్దం అని ఆశ్చర్య పోతూ, పెరటిగుమ్మం తలుపు తీసి పెరట్లోకి వెళ్ళారు.

నూతి గట్టుమీదరెండు జడల దయ్యాలు కూర్చుని, ఒక నగల మూటను ఊపుతూ గలగల శబ్దం చేస్తున్నవి. అది చూసి కెవ్వున అరవబోయిన అత్తాకోడళ్ళకు గొంతు పెగ ల్లేదు. అది గమనించిన జడలదయ్యాలు, ''భయపడకండి! మనుషుల్లో మంచివాళ్ళు న్నట్టే, దయ్యాల్లో మంచి దయ్యాలుండడం విడ్డూరమేంకాదు. అసలు సంగతేమంటే-అత్తాకోడళ్ళ పోరులేని ఇంట, ఈ నగల మూట వదిలి వెళదామని, ఊరంతా గాలిస్తూ ఇటు వచ్చాం. ఎంత తిరిగినా ఎక్కడా అలాంటి ఇల్లు ఒక్కటీ కనిపించలేదు. ఈ ఇంట్లోనూ అత్తాకోడళ్ళ మధ్య సఖ్యతవున్నట్టు తోచదు!'' అంటూ ఉస్సురుమన్నది పెద్ద జడలదయ్యం.

ఈ మాటలతో కొంత ధైర్యం తెచ్చుకున్న





Tuesday మంగళవారం মঙ্গলবাৰ Assamese మొంగల్బార్



ఆండాళ్ళమ్మ, ''సరే, ఇంతకూ ఈ నగల మూట మీకెక్కడిది?'' అని అడిగింది మెల్లగా అడుగు ముందుకు వేస్తూ. ఆ ప్రశ్నకు చిన్న జడలదయ్యం రెండు చేతులతో గట్టిగా తలగోక్కుని, మొన్న అర్ధరాత్రి మేమిద్దరం అడవిలో తిరుగు తూండగా, ఇద్దరు దొంగలు ఈ నగల మూటతో మాకెదురు పడి, కెవ్వుమంటూ కేకపెట్టి, మూటను జారవిడిచి చెట్లకడ్డంపడి పరుగు తీశారు,'' అన్నది.

ఆ జవాబు వింటూనే ఆండాళ్ళమ్మ ఏదో మాట్లాడబోయేంతలో అరుంధతి ఆగమన్నట్టు అత్తకేసి గట్టిగా చేయివూపి, ''మీ కథ బుద్ధిమంతులూ నమ్మదగినట్టుగానే వుంది! అయితే, ఆ నగలను ఎవరైనా పేదవాళ్ళకు దానం చెయ్యకుండా, పోరు లేని అత్తాకోడళ్ళకే ఇవ్వాలన్న ఆలోచన ఎందుక్కలిగింది మీకు?'' అని అడిగింది.

అందుకు పెద్ద జడలదయ్యం విచారంగా, ''గొంతు పట్టుకుపోయే ప్రశ్న అడిగావు, కోడలా! మేమిద్దరం కూడా మీలాగే అయిన దానికీ కానిదానికీ పోట్లాడుకునే అత్తాకోడళ్ళమే. మా ఇంటికెదురుగా ధ్యానమందిరం ఒకటుండేది. అందులో ధ్యానం చేసుకునే జటామునికి, మా అరుపులూ కేకలూ ధ్యాన భంగం కలిగిస్తూండడంతో ఆగ్రహించి, మమ్మల్ని దయ్యాలై పొమ్మని శపించాడు. అప్పుడు మేం ఆయన పాదాలపై బడి, క్షమించమని కోరగా – ఏ ఇంట్లో అయితే, అత్తాకోడళ్ళు సఖ్యంగా వుంటారో, ఆ ఇంటికి మీరు మంచి చేశారంటే, అప్పుడు మీకు దయ్యాల రూపం పోయి మనిషి రూపం వస్తుంది, అని చెప్పాడు,'' అన్నది.

అప్పుడు ఆండాళ్ళమ్మ, ''ఇంతకూ ఆ నగల మూటను మాకిస్తారు గదా!'' అన్నది సందేహిస్తూ. ''ఓ, నిక్షేపంగా ఇస్తాం! దానికి బదులుగా, మీరు మాకొక మాటివ్వాలి,'' అన్నది చిన్న జడలదయ్యం. ''అలాగే! చెప్పండి,'' అన్నారు అత్తాకోడళ్ళు ఆశగా.

''వచ్చే పౌర్ణమికి నగల మూటతో మళ్ళీ వస్తాం. ఈ నగల మీది ఆశతో కాకుండా, మీ అత్తాకోడళ్ళు నిజంగానే ఎంతో సఖ్యంగా వుండాలి. అలావున్నారా లేదా అనేది, మేం అదృశ్యంగా వుండి కనిపెడుతూనే వుంటాం. సరే, తొలికోడి కూసేవేళయింది. పోయి, తలుపులు మూసుకుని పడుకోండి,'' అన్నవి

జడలదయ్యాలు. అత్తాకోడళ్ళు తృప్తిగా తలాడించి, ఒకరి చెయ్యి ఒకరు పట్టుకుని ఇంట్లోకి వెళ్ళాక, దయ్యాలు రెండూ పెరటి గోడదూకి చీకట్లో కలిసిపోయాయి.

ఆ మర్నాటి నుంచీ అత్తాకోడళ్ళు మంత్రం వేసినట్టుగా, తల్లీకూతుళ్ళలాగా సఖ్యంగా, ప్రేమగా మెలగసాగారు. ఇది చూసి అమర య్యకు అంతులేని ఆనందమూ ఆశ్చర్యమూ కలిగింది. ఈ విధంగా ముప్ఫయి రోజులు గడిచి పోయాయి.

ఆ రోజు పౌర్ణమి. పెరట్లో వెన్నెల విరగ బూచి కాస్తున్నది. ఎప్పుడు ఆ జడల దయ్యాలు వస్తాయా, నగల మూట తమ చేతికిస్తాయా అని, అత్తాకోడళ్ళిద్దరూ నిద్ర పోకుండా కాచుక్కూర్చున్నారు. తొలికోడి కూసింది. అయినా దయ్యాల జాడలేదు.

అత్త ఆండాళ్ళమ్మ విచారంగా అరుంధ తితో, ''మనం ఎలాంటి దురుద్దేశాలు లేకుండా ప్రేమ కన బరుచుకోవాలని దయ్యాలు చెప్పాయి కదా! నాకు లోలోపల అప్పుడప్పుడు కొన్ని చెడ్డ ఆలోచనలూ, కపట బుద్ధీ కలిగిన మాట నిజం. ఇది గ్రహించే దయ్యాలు రాలేదనుకుంటున్నాను,'' అన్నది.

''నీలాగే నాకూ అలాంటి ఆలోచనలు వచ్చిన మాట నిజం, అత్తయ్యా! నగల సంగతి ఎందుకు? ఈ నెల్లాళ్ళూ మనం ఎంతో అన్యోన్యంగా వున్నాం. ఇక బతికినన్నాళ్ళూ ఇలాగే కలిసి కట్టుగా జీవిద్దాం. అప్పుడు, మీ అబ్బాయి కూడా ఎంతగానో సంతోషిస్తాడు,'' అన్నది అరుంధతి.

''అవును మరి! చిన్న దానివైనా ఎంచక్కటి ఆలోచనవచ్చిందే నీకు, అరుంధతీ!'' అంటూ ఆండాళ్ళమ్మ, కోడలిని మెచ్చుకున్నది.

పక్కగదిలో వున్న అమరయ్య, తొలికోడి కూతవింటూనే, ఇక పొలానికి వెళ్ళాలని బయల్దేరబోతూ, వాళ్ళ సంభాషణ విని, అత్తాకోడళ్ళలో వచ్చిన మంచి మార్పుకు చాలా ఆనందించాడు.

తన మిత్రులిద్దరూ దయ్యాల రూపంలో వచ్చి తన ఇంటిని చక్కదిద్దారన్న సంగతి, అతడికి తెలియదు మరి!

– జి.సి. జీవ్ని







# విచిత్ర స్వప్నం



లక్ష్మీపురం గ్రామంలో, ధనికరైతుకుటుంబానికి చెందిన శివరాముడనే యువకుడుండేవాడు. వాడి తల్లితండ్రులు కాలం చేయడంతో, వాడి మేనత్తవాణ్ణి పెంచి పెద్ద చేసింది. శివరాముడిలో బద్ధకం పాలెక్కువ. వాడు పొలం పనులు కూలీల మీదా, నౌకర్ల మీదా వదిలి గ్రామంలో స్వేచ్ఛగా తిరుగుతూండేవాడు.

ఇలా వుండగా – ఒక అమావాస్య నాటి రాత్రివేళ వాడు సుష్టుభోజనం చేసి గదిలో గుర్రుపెట్టి నిద్రపోయాడు. తెలతెలవారుతూండగా, వాడికొక విచిత్రమైన కల వచ్చింది.

ఆ కలలో అంకాళమ్మ గుడి ముందు ఒక బంగారు సింహాసనం వుంది. ఆ సింహాసనం మీద శివరాముడు కూర్చునివున్నాడు. వాడి తల మీద ఒక గుడ్లగూబ వాలివుంది. గ్రామస్థులందరూ అంకాళమ్మ గుడిలోకి వెళ్ళకుండా, వాడికి పూజలు చేస్తూ, నైవేద్యం పెడుతున్నారు. దూరాన ఒక కుక్క మాత్రం వాణ్ణి చూసి అదే పనిగా మొరుగుతున్నది.

శివరాముడికి మెలుకువ వచ్చింది. ఆ కలను మరిచిపోలేక పోయాడు. వాడు ఆ కల గురించి మేనత్తకు చెప్పి అర్థం అడిగాడు. మేనత్త నవ్వి, ''ఒరే, శివా! కలలు దేవరహస్యాలు. మనబోటి పామరులకు అర్థంకావు. మన గ్రామపెద్ద హరినారాయణుడు తెలివిగలవాడు. ఆయన్ని కలిసి అర్థం అడుగు,'' అని సలహాయిచ్చింది.

శివరాముడు, హరినారాయణుడి దగ్గరకు వెళ్ళి, తన కల గురించి వివరించి అర్థం అడిగాడు. హరినారాయణుడు, ''నిన్ను నీవు గొప్పగా ఊహించుకుంటున్నావు. అందువల్లే అలాంటి కల వచ్చింది,'' అని చెప్పాడు.

అందుకు శివుడు, ''అయ్యా! నా గురించి నేనెంత గొప్పగా ఊహించుకున్నా, దేవతకంటే గొప్పగా ఏనాడూ ఊహించుకోలేదు. పోనీ, కుక్క నన్ను చూసి ఎందుకు మొరిగింది? గుడ్లగూబ నా తల మీద ఎందుకు వాలింది?'' అని ప్రశ్నించాడు.

హరినారాయణుడు మరొకసారి తలగోక్కుని, ''మన పొరుగూరి జమీందారు శ్రీనిధుడు ఇటువంటి కలల గురించి అర్థం చేసుకునేందుకు చాలా శాస్త్రగ్రంథాలు చదివాడు. ఆయన్ని అడిగి చూడు,'' అని చెప్పాడు.

శివుడు, శ్రీనిధుడి వద్దకు పోయి సంగతి చెప్పాడు. ఆయన ఆశ్చర్యపోతూ, శివుడి ముఖంకేసి ఒకటికి రెండు సార్లు చూసి, ''మీ గ్రామానికిఏదో అరిష్టం రాబోతున్నది. అందుకే, కలలో గ్రామస్థులు దేవతకు కాకుండా, నీకు పూజలు చేశారు,'' అంటూ వివరణ ఇచ్చాడు.

శివరాముడికా వివరణ అంతగా నచ్చ లేదు. ''మరి కుక్క, గుడ్లగూబల మాటేమిటి?'' అని అడిగాడు. ''తనకు తిండి పెట్టనందుకు కుక్క మొరిగింది. దేవతకు కాక, నీకు పూజలు జరిపించుకున్నందుకు, నీకు కీడు జరగాలని గుడ్లగూబ నీ తల మీద వాలింది!'' అని చెప్పాడు శ్రీనిధుడు.

శివరాముడు తన గ్రామానికి బయలు దేరాడు. గ్రామం చేరాక అలసటతో గ్రామం మధ్యవున్న మర్రిచెట్టునీడలో కూర్చున్నాడు. అక్కడ చుట్టకాల్చుకుంటున్న బైరాగి, శివ రాముణ్ణి, ''ఏరా అబ్బీ! ఈమధ్య కానరా లేదు. ఏమయ్యావు?'' అని ప్రశ్నించాడు.

ఈ బైరాగిని గ్రామంవాళ్ళు, పిచ్చివాడు, మతి సరిగాలేనివాడు-అని హేళనచేయడం, శివుడికి తెలుసు. వాడు బైరాగితో, ''నాకొక వింత కల వచ్చింది. దాని అర్థం తెలుసు కోడానికి ఊళ్ళన్నీ తిరుగుతున్నాను,'' అని



చెప్పాడు. బైరాగి చుట్టను దూరంగా గిర వాటువేసి చిన్నగా నవ్వి, ''సరైన అర్థం ఎవరూ చెప్పలేదుగదా, అవునా?'' అన్నాడు. ''అంతే జరిగింది! అయినా ఆ సంగతి నీకెలా తెలుసు?'' అని అడిగాడు శివరాముడు.

''ఓరి వెర్రివాడా! నీ కలకు అర్థం చెప్ప గలవాడు, ఈ భూప్రపంచంలో ఒకే ఒక్కడు వున్నాడు; వాడెవరెవడో కాదు, నేనే!'' అన్నాడు.

శివరాముడు చిన్నగా నిట్టూర్చి, ''ఎవరి బుర్రలో ఏముందో, ఆ అంకాళమ్మకే ఎరుక. సరే, కల అర్థం నీవు చెప్పగలవేమో చూడు!'' తన కల గురించి వివరించాడు.

అంతావిన్న బైరాగి ఫక్కున నవ్వి, తాపీగా చుట్టముట్టించి, ''అరె ఒరె అబ్బీ, విను మరి! ప్రజలలో దైవభక్తి తగ్గిపోతున్నది. స్వార్థం, సోమరితనం పెరిగి పోతున్నాయి. అందుకు నిదర్శనంగా, పనీపాటా లేకుండా సోమరిలా తిరిగే నీకు పూజలు జరిపి నైవేద్యం పెట్టారు. ఇక బంగారు సింహాసనం నీలోని పొగరు బోతుతనానికీ, ఆశకూ కొండగుర్తు లాంటిది!'' అన్నాడు. ''ఐతే కుక్క ఎందుకు మొరిగింది? గుడ్లగూబ నాతల మీద ఎందుకు వాలింది?'' అని అడిగాడు శివరాముడు.

ఆ వెంటనే బైరాగి, ''నిన్ను పెంచి పెద్ద చేసిన నీ మేనత్త నీకు రోజూ కడుపునిండుగా భోజనం పెడుతూ, ఆ కుక్కకు ఒక ముద్ద అన్నం వేస్తున్నది. సొంత పొలం పనులు వాళ్ళకూ, వీళ్ళకూ అప్పగించి గ్రామంలో తిరిగే నువ్వంటే అసహ్యంచుకుని కుక్క మొరిగింది.

గుడ్లగూబ మాటంటావా – గుడ్లగూబకు చీకటంటే మహా ఇష్టం. సోమరితనం, అజ్ఞానంలో బతికే నువ్వు చీకటికంటే కటిక చీకటివి. అందుకే గుడ్లగూబ నిన్ను ఆప్యా యంగా ఆశ్రయించింది!'' అని చెప్పాడు.

దానితో శివరాముడు చేతులు జోడించి, ''నీవు పిచ్చివాడివి కాదు; గొప్ప మేధావివి. నువ్వు కలను వివరించిన తీరు – నన్ను ఎంత గానో ఆకట్టుకున్నది. ఇప్పటికి నా సోమరి నేత్రాలు తెరిపిన పడినై,'' అని ఇంటికేసి బయల్దేరాడు.

– ఎన్. శివనాగేశ్వరరావు





# వినయుడి శాస్త్రజ్ఞానం!

వేణుస్వామి అనే వైద్యుడు, తను నివసించే ఊళ్ళోనేగాక, చుట్టుపక్కల ఊళ్ళల్లో కూడా ఘనవైద్యుడుగా పేరు ప్రతిష్ఠలుకలవాడు. ఒక రోజు ఆయన తన దగ్గరకు వచ్చిన వాళ్ళను పరీక్షించి కొందరికి మందులూ, మరికొందరికి ఆరోగ్యాన్ని కాపాడుకోవడానికి అవసరం అయిన సలహాలూ ఇచ్చి, భోజనానికి వెళ్ళబోతూండగా, ఒక యువకుడు ఆయన దగ్గరకు వచ్చి వినయంగా నమస్కరించాడు.

వేణుస్వామి, ఆ వచ్చిన యువకుడు ఏదైనా అస్వస్థతకారణంగా వచ్చాడేమో అనుకుంటూ ప్రశ్నించబోయేంతలో అతడు, ''స్వామీ, నా పేరు వినయుడు. నా వయసు ఇరవైఏళ్ళు. గత పదేళ్ళుగా ప్రముఖ వైద్యుల వద్ద వైద్యశాస్త్రానికి సంబంధించిన అన్ని గ్రంథాలూ చదివి ఆకళింపు చేసుకున్నాను. కొద్ది రోజుల పాటు తమకు శుశ్రూషచేసి స్వయంగా ఈ ఊళ్ళోనే వైద్యవృత్తి చేపట్టాలనుకుంటున్నాను,'' అన్నాడు.

ఆ యువకుడి మాట తీరు చూస్తూంటే, వాడిలో విద్యపాలుకన్న ప్రగల్భంపాలు ఎక్కువున్నట్టు తోచింది, వేణుస్వామికి. ఆయన యువకుడితో, ''నాకు శుశ్రూష ఏనాడైనా ప్రారంభించవచ్చు. ఇప్పుడే కబురందింది-శేషన్న పెరట్లోని అరటిగెల నరకబోయి ప్రమాదవశాన చేయికోసుకున్నాడు. చికిత్స అవసరంకదా; ఏం చేద్దామంటావు?'' అంటూ ప్రశ్నించాడు.

వెంటనే వినయుడు కంగారుపడిపోతూ, ''నా గ్రంథాలన్నీ నేను దిగిన విడిదిలో వున్నాయి. ఇలాంటి ప్రమాదాలకు సరైన చికిత్స చరకంలో వుందో, సుశృతంలోవుందో చూసివస్తాను,'' అంటూ బయల్దేరబోయాడు.

అప్పుడు వేణుస్వామి, ఆ యువకుణ్ణి వారించి, ''నువ్వు చరక సుశృతాలు తిరగవేసే లోపలశేషన్న రక్తస్రావంతో పైలోకాలకు ప్రయాణం కడతాడు. ఒక పని చెయ్యి; నువ్వనే ఆ మహద్గ్రంథాలను గురుముఖతా మరికొంతకాలం పఠించు!'' అన్నాడు.





# కనకయ్య పట్నంప్రయాణం




కామయ్య, కనకయ్య ఒకే గ్రామంవాళ్ళు. కామయ్య కమ్మరం పనివాడు. కనకయ్య వడ్రంగి. ఇద్దరికిద్దరూ తమ తమ వృత్తుల్లో, మంచి పనితనంగలవాళ్ళు. ఒకసారి ఆ గ్రామానికి పట్నంలో కంచు, రాగి పాత్రల వ్యాపారం చేసే వర్తకుడొకాయన వచ్చాడు. అతడికి కామయ్య చేసే కంచు, రాగి పాత్రల పనితనం బాగా నచ్చింది. మంచి జీతం ఇస్తానని చెప్పి కామయ్యను పట్నం రమ్మన్నాడు.

కామయ్యకు వెళ్ళాలనుందికాని, భార్య అందుకు అభ్యంతరం చెప్పింది. ఐతే, ఆ సమయంలో చెల్లెలిని చూడవచ్చిన కామయ్య బావమరిది కలగజేసుకుని, కామయ్యతో, ''తప్పక వెళ్ళు. మంచి జీతమేవుంటుంది. నాలుగైదు నెలల పాటు చూసి పనితీరూ, సంపాదనా తృప్తికరంగా లేకపోతే తిరిగి రావచ్చు,'' అని చెప్పాడు.

ఇది కామయ్యకూ, అతడి భార్యక్కూడా బావున్నట్టు తోచడంతో, కామయ్య వర్తకుడి వెంట బయల్దేరి పట్టణానికి వెళ్ళాడు. ఈ జరిగిందంతా పక్క వీధిలో వున్న వడ్రంగి కనకయ్య భార్య కామాక్షికి తెలిసింది. ఆమెకు, తన భర్తని మించిన వడ్రంగి చుట్టు పక్కల గ్రామాల్లో ఎక్కడా లేడని గట్టి నమ్మకం. గ్రామం వదిలి పట్టణం పోదామనీ, అక్కడ బాగా సంపాయించి, ఒక చిన్న డాబా ఇల్లు కట్టుకుని సుఖంగా కాలం గడుపుదామనీ భర్తతో పోరుతూండేది.

ఇప్పుడు, కామయ్య పట్నం వెళ్ళడంతో కనకయ్యకు, భార్య పోరు మరీ ఎక్కువైంది. ''భార్యా, పిల్లాజెల్లా వున్న కామయ్య వాళ్ళందరినీ ఇక్కడ వదిలి డబ్బు సంపాదనకు పట్నం వెళ్ళాడు. మనకా, నువ్వూనేనూ తప్ప మరెవరూ లేరు. నీకు తెలివితేటలైతే వున్నవిగాని, పిరికి పాలెక్కువ,'' అంటూ, కనకయ్యను బాధ పెట్టసాగింది.

ఈ బాధ భరించలేక కనకయ్య బయల్దేరి పట్నం చేరాడు. అక్కడ కామయ్యను కలుసు

కుని సంగతి చెప్పి, తన కెక్కడైనా పని దొరికే మార్గం చూడమన్నాడు. కాని, కామయ్య ఎందర్ని విచారించినా, పట్నంలో ఇప్పుడున్న వడ్రంగులకే పనులు అంతంత మాత్రంగా వున్నవనీ, కొత్త వాళ్ళకు నాలుగు కాలాల పాటు నిలిచే పని దొరకదనీ తేల్చిచెప్పారు.

ఈ పరిస్థితుల్లో కనకయ్య, నాలుగు నెలల పాటు పట్నంలో చాలీ చాలని సంపాదనతో నానా అవస్థలూ పడి, ఇక ఇల్లు చేరడం మేలనుకున్నాడు. ఐతే, చేతిలో చిల్లిగవ్వ లేకుండా తిరిగొచ్చిన తనను, భార్య మరింత చులకనగా చూస్తుంది. అందుకని, అతడు బాగా ఆలోచించి, ముక్కు నుంచి తల మీదికి చుట్టుకున్న తలగుడ్డతో చీకటి పడుతున్న వేళ ఇల్లు చేరి, తలుపు తట్టాడు.

భార్య కామాక్షి తలుపు తెరుస్తూనే అతణ్ణి చూసి, ఆదుర్దాగా, ''ఇదేమిటి? ముక్కూ, చెవులూ కనబడకుండా తలగుడ్డ బిగించావు?'' అని అగింది. ''పట్నంలో సంపాయించిన డబ్బు సంచీతో వస్తూండగా, చీకటి పడే వేళ గ్రామ పొలిమేరల్లో ముగ్గురు దొంగలు నన్ను అటకాయించారు. కష్టపడి సంపాయించిన డబ్బు కదా, నేను సాహసించి తిరగబడ్డాను. అప్పుడు దొంగల్లో ఒకడు కత్తి చూపుతూ, ''నీకు ప్రాణమే కావాలో, డబ్బే కావాలో వెంటనే తేల్చుకో! నోరు మెదపకుండా డబ్బు సంచీ ఇచ్చావో ప్రాణాలతో వదులుతాం. గొడవచేశావో, ముక్కూ చెవులూ కోసేస్తాం,'' అన్నాడు.

''అయ్యో, ఇంత అన్యాయమా! ఆ పాడు డబ్బు, వాళ్ళ ముఖాన కొడితేసరి పోయేదిగదా, ముక్కూ చెవులూ లేకుండా నలుగురి మధ్యా ఎంత అవమానం, సిగ్గు చేటు,'' అంటూ కామాక్షి, భర్త ముఖం మీదవున్న గుడ్డను తీయబోయేంతలో, కనకయ్య దాన్ని తనే లాగి, ''నువ్విప్పుడన్న పనే చేశాను. పట్నంలో సంపాయించినదంతా ఆ దుష్టుల పాలయింది. భయం వదలక, ముక్కూ చెవుల్ని అలా కప్పి ఇల్లు చేరాను,'' అన్నాడు గొంతు కాస్త వణికిస్తూ. ''వాళ్ళు దోచుకున్నది డబ్బునే కదా, వడ్రంగి పనితనాన్ని కాదుగదా? బాధపడకు,'' అంటూ కామాక్షి భర్తను ఊరడించింది. – డి. శంభుదాసు



**Avail the loyalty bonus!**

**Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions)**



# Chandamama!

**Because stories make the world go round...**

**Choose your Chandamama!**
**Go to www.chandamama.com & subscribe Now!!**



**Chandamama is available in English and 12 regional languages. Junior Chandamama for children below 9 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior

Name: ....................................................................................

Date of Birth: ................................ Sex :....................................

Address: ................................................................................

..............................................................................................

..............................................................................................

.................................................... City: ......................................

State:.......................................... Pin:............................................

Telephone:..............................................................................

Mobile:....................................................................................

Email:......................................................................................

Subscription Number 9for renewals):..........................................

Gift Subscription to the following address:

..............................................................................................

..............................................................................................

..............................................................................................

..............................................................................................

Enclosed Cheque/DD* for Rupees.............................................

Cheque/DD No ........................................................................

favouring Chandamama India Ltd on.........................................

..................................................................................bank.

Please mail the subscription form to:
**Chandamama India Limited,**
B-3, Lunic Industries, Cross Road 'B',MIDC, Andheri (East),
Mumbai-400093. Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at: www.chandamama.com

## Get surprise gifts by subscribing this month **

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 240 | Rs. 375 |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 190 | Rs. 300 |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| You Save | | Rs. 35 | Rs. 80 | Rs. 145 | Rs. 225 |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

## అందవికారంకోసం పాట్లు



అరుణాచలప్రదేశ్‌లో అపటేనిస్ అని ఓ తెగ ఉంది. ఈ తెగ ప్రజలు ఇప్పటికీ సూర్యచంద్రులను తమ దేవుళ్లుగా భావించి, పూజిస్తుంటారు. భూతవైద్యులు ఈ దేవతలకు, తెగకు మధ్య అనుసంధానకర్తలుగా ఉంటారు. తెగలో ఎవరయినా జబ్బుపడితే భూతవైద్యులు అన్నిరకాల బలులు, పూజలు చేసి వ్యాధిగ్రస్తులకు జబ్బులు పోగొడుతుంటారు. అపటేనిస్ తెగ వారు తాము కష్టపడి సంపాదించిన డబ్బును మతపరమైన భారీ నిర్మాణాల కోసం వెచ్చించరు.

పచ్చబొట్టు పొడిపించుకోవడం, పెద్దపెద్ద ముక్కెరలను ధరించడాన్ని ఈ తెగ మహిళలు బాగా ఇష్టపడేవారు. తెగలో వయోవృద్ధుడు మరణిస్తే తెగ సభ్యులందరూ సంబరాలు చేసుకునేవారు. అందరూ చేరి పాడతారు, నాట్యం చేస్తారు, బహుమతులు అందించుకుంటారు. ఈ బహుమతులను మృతుల దేహాలతో కలిపి పూడ్చిపెడతారు.

## ఇళ్ళకు తలుపులు లేని ఊరు




తలుపులు లేని గ్రామాన్ని మీరు చూడదలిస్తే, షిర్డీ నుంచి 65 కిలోమీటర్ల దూరంలో ఉన్న శని శింగ్నపూర్‌కు పర్యటించాల్సి ఉంటుంది. హిందువుల దేవుడు శనికి ఆలయం ఉన్న ఊరుగా ఈ గ్రామం పేరు పొందింది.

శింగ్నపూర్‌లో ఏ ఇంటికీ తలుపులుండవు. ప్రతి ఇంటికీ ద్వారమందిరాలు మాత్రమే ఉంటాయి. ఈ ఊరి ప్రజలు తమ వస్తువులకు ఎన్నడూ తాళంవేసి భద్రపర్చి ఎరుగరు. దొంగతనం చేయడానికి ప్రయత్నిస్తే శనిదేవుడు వారిని శిక్షిస్తారని ప్రజల నమ్మకం.

శింగ్నపూర్‌కు వచ్చే భక్తులు, యాత్రికులు, పర్యాటకులు విలువైన వస్తువులను వాహనాలలోనే ఉంచి తలుపులకు తాళాలు వేయకుండా ఉంచుతారు. తమ వస్తువుల భద్రతపై వారు అణుమాత్రం కలవరపాటుకు గురికారు.



# మన చరిత్ర పుటల నుంచి

## వారసుడు

*ఢిల్లీ నగరం, ఏప్రిల్ 15, క్రీ.శ 1236*

షంషుద్దీన్ ఇల్‌టుట్‌మిష్ వారసుడు, ఢిల్లీ సామ్రాజ్య యువరాజు, రుక్నుద్దీన్ ఫిరోజ్ షా ఉడికిపోతున్నాడు. వైభవంగా అలంకరించిన తన ఆస్థాన ఏనుగుపై ఫిరోజ్ కూర్చుని ఉన్నాడు. గుర్రపు స్వారీతో ప్రయాణం అతడికి కష్టతరంగా మారింది. కుదుపులతో ఒళ్లు నొప్పులు తీవ్రమయ్యాయి. చివరకు ఏనుగు స్వారీ కూడా అతడికి అసౌకర్యంగానే ఉంది. అతడి దండనాయకుడు తీక్షణంగా చూస్తూ, కింద ఉన్న వారికేసి అరుస్తూ, తలుపులు తీయవలసిందిగా ఆదేశించాడు. ఫిరోజ్ ఆ భారీ ఇనుపతలుపుల కేసి చూశాడు. చాలా కాలం తర్వాత తిరిగి వచ్చిన తనకు పురప్రజలు ఘనస్వాగతం చెబుతారని ఆతడాశించాడు.

అయితే ఢిల్లీ నిర్జన ఎడారిలా కనిపించింది. అతడు భుజాలెగురేస్తూ, మేని ఆభరణాలు సవరించుకున్నాడు. తన తండ్రి ఇప్పుడు మరణశయ్యపై ఉన్నాడు. అందుకే తనకు స్వాగతం లభించలేదేమో. రాజమందిరంలోని శీతల భవంతులలోకి అడుగు పెట్టగానే అతడు నిట్టూర్పు విడిచాడు. రాజ వైద్యుడు అతడికి ఎదురేగి, తండ్రి ఆరోగ్యం గురించి చెప్పాడు. తన పరిస్థితి బాగాలేదని తెలిపాడు.



రోజ్ నిట్టూర్చాడు. భటులు కాపలా కాస్తున్న ఓ మందిరం మెలుపల నిలబడ్డాడు. అతడు మందిరంలోకి ప్రవేశించగానే భటులు పక్కకు వెళ్లిపోయారు. మందిరంలోపల ఇల్‌టుట్‌మిష్ ఉన్నాడు. అతడో యుద్ధ యోధుడు, సైనికుడు, పాలకుడు. పాలిపోయిన ముఖంతో కనిపిస్తున్నాడు. మందు తీసుకుంటున్నప్పుడు అతడి చేతులు వణుకుతున్నాయి. ఆందోళన, విచారంతో ఫిరోజ్ తండ్రి పక్కన నిలబడ్డాడు. అతడు తండ్రి పక్కన కూర్చుని అభ్యర్థిస్తున్న స్వరంతో అన్నాడు. ''నాకిచ్చిన గౌరవానికి కృతజ్ఞతలు జహాపనా, నేను నా

శాయశక్తులా...'' ఇల్‌టిట్‌మిష్ చేయి అడ్డంగా ఊపాడు. చిరాకు, వినోదం అతడి కళ్లలో ప్రతిఫలించాయి. ''నీకు ఆశాభంగం కలిగిస్తున్నందుకు చింతిస్తున్నా ఫిరోజ్, నేను నా వారసుడిని నిర్ణయించేశాను. నువ్వు మాత్రం కాదు.'' ఫిరోజ్ మూగవాడిలా అయిపోయాడు. ''కానీ, నేను నసిరుద్దీన్ మహ్మద్ కంటే పెద్దవాడిని, నాకు హక్కు ఉంది.'' అతడి గొంతు వణికింది. ''కానీ ప్రతిభ కాదుగా'' ఇల్‌టుట్‌మిష్ తేల్చి చెప్పాడు. ''సింహాసనం రజియాకే దక్కుతుంది.''

ఈసారి ఫిరోజ్ మూగబోయాడు. నిర్ఘాంత పోయాడు. 'రజియా...' కాస్సేపు తర్వాత నిట్టూర్చిన తర్వాత అన్నాడు. 'నా సోదరి.. ఓ మహిళ..' ''తప్పకుండా ఆమే'' ఇల్‌టుట్‌మిష్ పొడి పొడిగా చెప్పాడు. ''ధైర్యసాహసాలతో, పురుష హృదయంతో ఆమె వ్యవహరించగలదు.'' 'ఆమె పురుషునికంటే ఎక్కువే' నాకు తెలుసది. ''ఫిరోజ్ ఒక్క గెంతున నిలిచాడు. భవంతి నుంచి వడివడిగా బయటకు అడుగు లేస్తూ, అన్నాడు.'' నాకు నమ్మశక్యంగా లేదు. ఒక మహిళ అంతఃపురం నుంచి బయటకు రావడం. ''ఇక చాలు. నేను నా పూర్వీకులను కలుసుకోవడానికి వెళుతున్నప్పుడు, ఆమె ఢిల్లీ సింహాసనాన్ని అధిరోహిస్తుంది. ఆమెకు కావలసిన మద్దతును నువ్వు అందించు.'' ''అందుకా తమరు నన్ను ఢిల్లీ పిలిపించింది.'' చనిపోవడానికి సిద్ధంగా ఉన్న మనిషితో ఘర్షించడానికి కూడా సిద్ధంగా లేనంతగా ఫిరోజ్‌ను పిరికితనం ఆవహించగా తండ్రిని ధిక్కరించే సాహసం చేయలేకపోయాడు. గిర్రున వెనుదిరిగి అతడు



మందిరం నుంచి వేగంగా వెళ్లిపోయాడు. ఇల్‌టుట్‌మిష్ వదనంలో కలవరం, ఆందోళన. ఫిరోజ్ తండ్రికి ఆ రాత్రి నిద్రలేదు.

తెల్లవారకముందే వార్త అల్లుకుపోయింది. షంషుద్దీన్ ఇల్‌టుట్‌మిష్ కాలధర్మం చెందాడు. తెల్లవారడానికి ఘడియకాలం ముందే కన్ను మూశాడు. తన ప్రియపుత్రిక చెంతనుండగా ప్రశాంతంగా నిద్రలోనే పోయాడు.

రుక్నుద్దీన్ ఫిరోజ్ షా సింహాసనం ఉన్న మందిరంలోకి ప్రవేశించాడు. ఆస్థానంలో ఉన్న వారు సర్దుకున్నారు. అతడు మెల్లగా సింహా



Wednesday బుధవారం বুধবাৰ Assamese బుధ్‌బార్



తాగుబోతు సైనికులు, నర్తకిలు, సైనిక క్రమశిక్షణ కొరవడటం. ఇవన్నీ నాకు తెలుసు. ''ఇంకా, నీకు తెలిసే ఉంటుంది, అతడి తల్లి షా తుర్కానే అతడి వెనుక ఉన్న నిజమైన శక్తి. ''ఢిల్లీలో అందరికీ ఆ విషయం తెలుసు.''

అల్లంత దూరం నుంచి పెద్దగా శబ్దం వినిపించింది. యాకుత్ అసహనంగా కదిలాడు. ''జనం నీకేసి చూస్తున్నారు రజియా.. కానీ నేను మహిళను మాత్రమే యాకుత్ వారి ఆశలన్నీ నీ మీదే ఉన్నాయి.'' రజియా అల్ దిన్.. ఇల్‌టుట్‌మిష్ గారాలపట్టి తాను కూర్చున్న ఆసనం మీంచి లేచి నిలబడింది. ఆమె లేచి నిలబడింది. గవాక్షం వద్దకు నెమ్మదిగా నడుచుకుంటూ వెళ్లింది. కింది భాగంలో ఎటు చూసినా ఢిల్లీనగరం విస్తరించి ఉంది. ఉదయ సూర్యకాంతిలో బురుజులు మెరుస్తున్నాయి.

తండ్రి చనిపోయిన తర్వాత గడిచిన ఏడు నెలలూ ఆమె జీవితం సాఫీగా సాగలేదు.

కదులుతున్న గుంపులవైపు ఆమె కిందికి చూసింది. రణగొణ ధ్వనిని విన్నది. ఢిల్లీ నగరాన్ని పరికించింది. నగరం ప్రశాంతంగా, శక్తివంతంగా, అతి సుందరంగా కనబడింది. యాకుత్ వైపు తిరిగే ముందు రజియా ఆకాశంకేసి తదేకంగా చూసింది.

''మనం అంతఃపురానికి పోతున్నాం. షాతుర్కాన్‌ను చూడడానికి వెళుతున్నాం.''

సనంవైపు నడిచాడు. 'మా తండ్రి అస్తమయ వార్తను మీకు చెప్పడానికి నేను చింతిస్తున్నాను,' అని చుట్టూ చేరిన వారికి చెప్పాడు. ''శుభవార్త ఏమిటంటే తను కన్నుమూయకముందే వారసుడి పేరు ప్రకటించాడు'' అంటూ అతడు నెమ్మదిగా గద్దెపై కూర్చున్నాడు. 'నేనే వారసుడిని.'

* * *

*ఢిల్లీ నగరం, నవంబర్ 22, క్రీ.శ 1236.*

**''మనమేం చేయాలి?''** జలాలుద్దీన్ యాకుత్ తన చేతులను ఊపుతూ అన్నాడు. ''ముల్తాన్, లాహోర్, హాన్సీ బదాన అవధ్ పాలకులు నగరాన్ని చుట్టుముట్టారు. ''వారు ఢిల్లీని సర్వనాశనం చేయగలరు. నీకు తెలుసు.'' ''మరి మీ సోదరుడు..'' ''ఫిరోజ్ నా సోదరుడు కాడు. ఢిల్లీని నాకు దూరం చేసినప్పుడే అతడా హక్కు కోల్పోయాడు.''

''ఇది వాదవివాదాలకు సమయం కాదు. ఫిరోజ్ ఢిల్లీని సర్వనాశనం చేసేశాడు.'' ''అతడి

* * *

*ఢిల్లీ శివార్లు, డిసెంబర్ 14 క్రీ.శ 1336*

"నేను దీన్ని నమ్మలేను. నమ్మనుగాక నమ్మను." ఆ స్వరం పొత్తికడుపును చీల్చుకుంటూ వచ్చింది. హన్సీ గవర్నర్ నిస్పృహతో వేగిపో యాడు. పీక్కుపోయిన అతడి కళ్లలో ఉబికిన నరాల్లో, వణుకుతున్న స్వరంలో ఆ నిస్పృహను పరివారం చూడగలిగింది. క్షణాల్లో ఈ వార్త దుమారంలో వ్యాపించింది. ఢిల్లీలో అడుగుపెట్ట కుండా ఆమెను నిరోధిస్తూ వచ్చిన కారుమే ఘాలు ఇప్పటికి తొలగినట్లున్నాయి. ఢిల్లీ సుల్తానా రజియాతో బుడాన్, అవధ్ చేతులు కలిపాయి. ఏం మంత్రం వేసి వారిని రజియా సుల్తానా తన వైపుకు తిప్పుకున్నదో ఎవరికీ తెలి యదు. తెలిసిందల్లా ఒక్కటే. సుల్తానా అసా ధ్యాన్ని సుసాధ్యం చేసింది. తన శత్రువులను చీల్చి అధికారం సాధించుకుంది. ఎలాంటి కుట్రా లేకుండానే ఇది సాఫీగా జరిగిపోయింది. ఇతరులు కూడా తనకు మద్దతు పలకడంతో హన్సీ గవర్నర్ ముట్టడికి అంగీకరించాడు. అది ఇప్పుడు ముగింపుకు వచ్చింది.

అర్ధరాత్రి దాడి జరిగి చాలా సేప యింది. కాని ఉత్సవాలు జరుగు తూనే ఉన్నాయి. ఆస్థానం సంరం భాలతో, నవ్వులతో, అట్టహాసాలతో దద్దరిల్లుతోంది. భృత్యులూ, సైని కులూ కలిసిపోయారు. తాము సురక్షితంగా ఉన్నామనే విషయం వారికిఇప్పటికీ నమ్మశక్యంగా లేదు.

యాకుత్ తన పక్కన ఉన్న యువతికేసి చూశాడు. "నీవు అసాధ్యాన్ని సాధించావు." రజియా భుజాలు ఎగురవేసింది. "షాతు ర్కాన్‌ను నిర్బంధించడమే కీలకంగా మారింది."

"అయితే అయిదుగురు గవర్నర్లలో అసమ్మతి బీజాలు నాటి కుట్రకు ముగింపు పలకావు కదా? అది అమోఘమైన వ్యూహం సుల్తానా." "ఆ పేరు పెట్టి పిలవద్దు యాకుత్. నేను ఏ సుల్తాన్‌కు భార్యను కాదు, యజమానురాలినీ కాదు. నేను జలాతుద్దీన్ రజియాను, ఢిల్లీ సుల్తాన్‌ని. ఒక పాలకుడు చేసే అన్ని పనులూ చేయగలను." శత్రువులతో ఏకముఖంగా పోరాడటమా? కాదు నీ ప్రజలను విశ్వసించడం, ఫలితంగా వారి విశ్వాసాన్ని తిరిగి పొందడం. రజియా మందహాసం చేసింది.

బయట ఢిల్లీపై సంధ్యారుణ కాంతులు అలుముకున్నాయి. – పవిత్రా శ్రీనివాసన్





# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరువాత వాటికింద ఇచ్చినపదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.

    

| English | Sunday | Monday | Tuesday | Wednesday | Thursday |
|---|---|---|---|---|---|
| Telugu | ఆదివారం | సోమవారం | మంగళవారం | బుధవారం | గురువారం |
| Hindi | रविवार<br>రవివార్ | सोमवार<br>సోమవార్ | मंगलवार<br>మంగళవార్ | बुधवार<br>బుధవార్ | गुरुवार<br>గురువార్ |
| Tamil | ஞாயிற்றுக்கிழமை<br>న్యాయిట్రు కిళమై | திங்கள்கிழமை<br>తింగల్ కిళమై | செவ்வாய்க்கிழமை<br>సెవ్వయ్ కిళమై | புதன்கிழமை<br>బుథన్ కిళమై | வியாழக்கிழமை<br>వియళక్ కిళమై |
| Bengali | রবিঁবার<br>రబిబార్ | সোমবার<br>సోంబార్ | মঙ্গলবার<br>మంగళ్‌బార్ | বুধবার<br>బుధ్‌బార్ | বৃহস্পাথিঁবার<br>బృహస్పతిబార్ |
| Marathi | रविवार<br>రవివార్ | सोमवार<br>సోమ్‌వార్ | मंगळवार<br>మంగళ్‌వార్ | बुधवार<br>బుధ్‌వార్ | गुरुवार<br>గురువార్ |
| Kannada | ಭಾನುವಾರ<br>భానువార | ಸೋಮವಾರ<br>సోమవార | ಮಂಗಳವಾರ<br>మంగళవార | ಬುಧವಾರ<br>బుధవార | ಗುರುವಾರ<br>గురువార |
| Oriya | ରବିବାର<br>రబిబార | ସୋମବାର<br>సోమబార | ମଙ୍ଗଳବାର<br>మంగళబార | ବୁଧବାର<br>బుధబార | ଗୁରୁବାର<br>గురుబార |
| Gujarati | રવિવાર<br>రవివార్ | સોમવાર<br>సోమ్‌వార్ | મંગળવાર<br>మంగళ్‌వార్ | બુધવાર<br>బుధ్‌వార్ | ગુરુવાર<br>గురువార్ |
| Assamese | ৰবিবাৰ<br>రొబిబార్ | সোমবাৰ<br>జోంబార్ | মঙ্গলবাৰ<br>మొగల్బార్ | বুধবাৰ<br>బుధ్‌బార్ | বৃহস্পতিবাৰ<br>బృహొస్పతిబార్ |
| Malayalam | ഞായർ<br>న్జయార్ | തിങ്കൾ<br>తింగళ్ | ചൊവ്വ<br>చోవ్వా | ബുധൻ<br>బుధన్ | വ്യാഴം<br>వ్యాళమ్ |
| Santali | ᱥᱤᱸᱜᱮ<br>సింగె | ᱚᱛᱮ<br>ఒటె | ᱵᱟᱞᱮ<br>బాలె | ᱥᱟᱜᱩᱱ<br>సాగున్ | ᱥᱟᱨᱰᱤ<br>సార్డేయ్ |
| Sanskrit | रविवासरः<br>రవివాసరః | सोमवासरः<br>సోమవాసరః | भौमवासरः<br>భామవాసరః | बुधवासरः<br>బుధ్వాసరః | बृहस्पतिवासरः<br>బృహస్పతివాసరః |



1. కింది బ్రాకెట్లలో ఇచ్చిన భాషలోని దినాలను రాయండి:
   ఆదివారం(అస్సామీస్):
   సోమవారం(మరాఠీ):
   మంగళవారం(మళయాళం):



**Wednesday** బుధవారం बुधवासरः **Sanskrit** బుధ్వాసరః

    


| English | Friday | Saturday | Time | Date | Day |
|---|---|---|---|---|---|
| Telugu | శుక్రవారం | శనివారం | సమయం | తేది | రోజు |
| Hindi | शुक्रवार<br>శుక్రవార్ | शनिवार<br>శనివార్ | समय<br>సమయ్ | दिनांक<br>దినాంక్ | दिन<br>దిన్ |
| Tamil | வெள்ளிக்கிழமை<br>వెల్లిక్ కిళమై | சனிக்கிழமை<br>సనిక్ కిళమై | நேரம்<br>నేరమ్ | தேதி<br>తేదీ | நாள்<br>నాళ్ |
| Bengali | শুক্রবার<br>శుక్రబార్ | শনিবার<br>శనిబార్ | সময়<br>సమయ్ | থারিঁখ<br>తారీఖ్ | ধিঁন<br>ధిన్ |
| Marathi | शुक्रवार<br>శుక్రవార్ | शनिवार<br>శనివార్ | वेळ<br>వేల్ | तारीख<br>తారీఖ్ | दिवस<br>దివస్ |
| Kannada | ಶುಕ್ರವಾರ<br>శుక్రవార | ಶನಿವಾರ<br>శనివార | ಸಮಯ<br>సమయ | ದಿನಾಂಕ<br>దినాంక | ದಿನ<br>దిన |
| Oriya | ଶୁକ୍ରବାର<br>శుక్రవార | ଶନିବାର<br>శనివార | ସମୟ<br>సమయ | ତାରିଖ<br>దినాంక్ | ଦିନ<br>దిన్ |
| Gujarati | શુક્રવાર<br>శుక్రవార్ | શનિવાર<br>షనివార్ | સમય<br>సమయ్ | તારીખ<br>తారీఖ్ | દિવસ<br>దివస్ |
| Assamese | শুক্ৰবাৰ<br>జుక్రోబార్ | শনিবাৰ<br>జొనిబార్ | বাৰ<br>జొమయ్ | তাৰিখ<br>తారిఖ్ | সময়<br>బార్ |
| Malayalam | വെള്ളി<br>వెల్లి | ശനി<br>శని | സമയം<br>సమయం | തീയതി<br>తేయథి | ദിവസം<br>దివసమ్ |
| Santali | ᱡᱟᱨᱩᱢ<br>జారుమ్ | ᱧᱩᱦᱩᱢ<br>నుహుమ్ | ᱚᱠᱛᱚ<br>ఒక్తో | ᱢᱟᱦᱤᱛ<br>మాహిత్ | ᱢᱟᱦᱟ<br>మాహా |
| Sanskrit | शुक्रवासरः<br>శుక్రవాసరః | शनिवासरः<br>షనివాసరః | समयम्<br>సమయమ్ | तिथिः<br>తిథిః | दिवसः<br>దివసః |

బుధవారం(సంస్కృతం):

గురువారం(హిందీ):

శుక్రవారం(గుజరాతీ):

శనివారం(బెంగాలీ):




2. ఖాళీలు పూరించండి:

ఎ) ప్రస్తుతం సమయ్ -------- ? (ఒరియా)

బి) ఈ రోజు తేదీ ---------- (గుజరాతీ)

సి) --------- తర్వాత సోమవారం వస్తుంది. (కన్నడ)



Thursday గురువారం गुरुवार Hindi గురువార్

# పాతాళదుర్గం - 20




*[రాక్షసులు నల్లగరుడపక్షికి ప్రాణాచారాలు పడుతున్న అదనులో, మాంత్రికుడు కొండమీది సరోవరజలం పాతాళదుర్గం మీద ప్రవహించేలా చేశాడు. నీటమునిగి చాలామంది రాక్షసులు చచ్చారు. మిగిలిన వాళ్ళతో మహాకలి సొరంగమార్గం కేసి బయలుదేరాడు. దాన్ని శశికాంతుడూ, కుంభీరుడూ తమ అనుచరులతో కావిలి కాస్తున్నారు. - తరువాత]*

కాలశంబర మాంత్రికుడు సొరంగ మార్గం పైభాగానికి చేరుతూనే కుంభీరుణ్ణి హెచ్చరిస్తూ, ''కుంభీరా! నువ్వు పాతాళదుర్గం రాజువయే క్షణం సమీపిస్తున్నది. నీ రాహువంశం వాళ్లు దండకారణ్యాన్ని హాయిగా ఏలుకోవచ్చు. కేతువంశం వాళ్లు సర్వనాశనం అవుతున్నారు,'' అన్నాడు.

మాంత్రికుడు మాట ముగించే లోపలే ధూమకుడు అతడి భుజం పట్టుకుని వెనక్కు తిప్పుతూ, ''మహాకలి సొరంగమార్గాన్ని సమీపిస్తున్నాడు,'' అని చెప్పాడు. ''వాడి ప్రయత్నమేమిటో నాకు తెలుసు. ఊ, రానివ్వండి. అందుబాటులోకి రాగానే వాళ్లమీద యీ రక్కసి బండలను తోయండి,'' అన్నాడు కాలశంబరుడు. మాంత్రికుడిలా చెపుతున్నంతలో మహాకలీ, అతడి అనుచరులూ సొరంగద్వారం ఉన్న ప్రాంతం చేరారు. జై, కుంభీపతీ! అంటూ మహాకలి తన చేతనున్న గదతో ఏనుగు తలమీద చిన్నగా కొట్టాడు. వెంటనే ఏనుగు నీళ్లలో మునిగింది. దానితో పాటు అతడి అంగరక్షకులిద్దరూ ఎక్కి వున్న ఏనుగు కూడా మునిగింది. వెంటనే ఫెళఫెళమంటూ పెద్ద ధ్వని అయింది. మాంత్రికుడూ, అతడి అనుచరులూ ఆ ధ్వని వచ్చిన

వైపుకు వెళ్ళి చూసేంతలో, మహాకలి సొరంగ మార్గానికి అడ్డుగా ఉన్న రాళ్ళను ఏనుగుతో పడదోయించి బయిటికి వచ్చేశాడు. అతడి వెనకగా, అంగరక్షకులెక్కి ఉన్న ఏనుగూ బయటపడింది. మరుక్షణంలో సొరంగ మార్గాన్నుంచి నీరు పెద్ద శబ్దం చేస్తూ వేగంగా బయిటికి ప్రవహించసాగింది.

కుంభీరుడూ, అతడి బంధువర్గం పట్టుకుని వున్న పులులూ, సింహాలూ ఆ నీటిని చూసి బెదిరిపోయినై, వాళ్ళు వాటిని అదుపు చేయబోయేంతలో మహాకలి వాళ్ళను చూసి ''కుంభీరా! నువ్విక్కడ ఏం చేస్తున్నావ్? ద్రోహీ, నువ్వే గదా సొరంగమార్గానికి రాళ్ళు అడ్డం పెట్టించింది?'' అంటూ అరిచి ఏనుగును అతడి మీదికి దూకించాడు.

కుంభీరుడు యిలాంటి ప్రమాదం రానున్నదని ముందే ఊహించి ఉండటంతో, చప్పున తన దగ్గిరున్న సింహాన్ని మహాకలి ఎక్కివున్న ఏనుగు మీదికి ఉసిగొలిపి దూరంగా పరిగెత్తి, రాహువంశానికీ, జై! అంటూ తన చేతుల్లో ఉన్న శూలాన్ని మహాకలికి గురిచేసి ఏనుగు డొక్కకు విసిరాడు. దానితో అది బెదిరిపోయి, మహాకలి ఆపాలని ప్రయత్నించినా ఆగకుండా, ఘీంకరిస్తూ అరణ్యం కేసి పరిగెత్తసాగింది. మహాకలి అంగరక్షకులు తమ నాయకుణ్ణి అనుసరించారు. కుంభీరుడు తన అనుచరులను హెచ్చరించి, సింహాన్ని తీసుకుని మహాకలి వెంటబడ్డాడు. కాని, యీలోపలే శశికాంతుడు, మహాకలి దారిని అడ్డగిస్తూ, అతడి మీద బాణాలు



ప్రయోగించసాగాడు.

కాలశంబర మాంత్రికుడు, శాంభవీ! అంటూ పెద్దగా అరిచి, ''ఆ దుర్మార్గుడికి అడ్డుతగలండి, నేనొస్తున్నాను!'' అంటూ సొరంగం మీది నుంచి కుప్పించి దూకుతూ కిందికి దిగి, మహాకలి కేసి పరిగెత్తాడు. ధూమకుడూ, సోమకుడూ, భద్రుడూ కూడా మాంత్రికుడి వెంట పరిగెత్తారు. సొరంగ ద్వారం నుంచి ప్రవాహం వెంట బయిటికి కొట్టుకువచ్చిన కొందరు రాక్షసులను, కుంభీరుడి అనుచరులు తేలికగా చంపేశారు. వాళ్ళు నీటపడి ఈది ఈది సగం చచ్చివుండటంతో వాళ్ళు అంతగా ప్రతిఘటించలేక పోయారు. పులులూ, సింహాలూ వాళ్ళమీదికి దూకి, కంఠాలను గావుపట్టు పట్టినై.

పరిస్థితి విషమించిందని గుర్తించిన




కొంత దూరంగా తీసుకుపోయాడు.

మహాకలి తన ఏనుగును శత్రువుల మీదికి ఉరికిస్తూ, అందినవాళ్లను గదతో మోదుతూ కొంతసేపు పోరాడి, ఇక లాభం లేదని తెలుసుకుని, అంగరక్షకులను హెచ్చరించి, దాన్ని శశికాంతుడి కేసి దూకించాడు. శశికాంతుడు బాణాలతో ఏనుగును అడ్డగించలేకపోయాడు. మహాకలి ఈ విధంగా శత్రువలయాన్ని ఛేదించుకుని కొండలకేసి పారిపోసాగాడు. అంగరక్షకులు అతడికి వెనకగా తమ ఏనుగును ఉరికించారు.

ఏనుగుతో దారి మార్గం లేని కొండ ఎక్కడం సాధ్యం కాదని తెలిసిన మహాకలి, ఆ కొండలో తాను ఏనుగుతో కూడా ప్రవేశించడానికి అనువైన గుహకోసం వెతికి, అలాంటి దొకటి కనిపించగానే, ఆగి, వెనక వస్తున్న అంగరక్షకులతో, ''శత్రువుల నుంచి మనం చాలా దూరం వచ్చేశాం. మనం దాగబోయే గుహ వాళ్లు కనుక్కోలేరు. అదుగో, ఆ ఎదురుగా కనిపించే గుహలోకి నే వెళ్తాను. మీరు ఈ దాపులనే ఏదైనా గుహలో దాగండి'' అంటూ గుహలోకి ప్రవేశించాడు.

మహాకలి అంగరక్షకులు తమ నాయకుడు గుహ ప్రవేశించగానే, తామెక్కి ఉన్న ఏనుగును అల్లంత దూరంలో ఉన్న మరొక గుహ దగ్గిరకు తీసుకుపోయి, శత్రువులెవరూ తమను వెన్నాడటం లేదని ధృవపరుచుకునేందుకు వచ్చిన మార్గం కేసి పరీక్షగా చూసి, తరవాత ఏనుగును మెల్లగా గుహకేసి నడిపారు. కాని, ఏనుగును జాగ్రత్తగా వాళ్లు గుహ

మహాకలి, నిలిచి పోరాడటం కన్న, పారిపోవటమే క్షేమం అనుకున్నాడు. కాని కాలశంబరుడు తనవాళ్లందర్నీ, అతడు అరణ్యంలోకి పారిపోకుండా దారి అటకాయించమన్నాడు. ''కావాలంటే వాణ్ణి కొండల కేసి పోనివ్వండి. అంతేగాని అరణ్యంలోకి ఒకసారి జొరపడ్డాడో ఇక మనకు కనబడడు,'' అని హెచ్చరించాడు.

మహాకలీ, అతడి అనుచరులిద్దరూ అన్ని వైపుల నుంచీ చుట్టుముట్టబడ్డారు. అరణ్యమార్గం వైపున కుంభీరుడూ అతని అనుచరులూ చేరి అతడి మీదికి రాళ్లూ, పెద్దపెద్ద చెట్లకొమ్మలూ విసరసాగారు. మరోవైపు నుంచి శశికాంతుడూ, సోమకుడూ వాళ్లమీద బాణాలు ప్రయోగిస్తున్నారు. ధూమకుడు మరిద్దరు అనుచరులతో రాకుమారి కాంతిసేననూ, భామాసింగినీ ఆ ప్రదేశం నుంచి



Thursday గురువారం गुरुवार Marathi గురువార్

ద్వారం దగ్గిరకు తీసుకుపోయి, లోన ప్రవేశిం చబోయేంతలో, గుహపైభాగాన్నుంచి, రాతిలో చేయబడిన పడవ లంగరొకటి గిరగిరా తిరుగుతూ వచ్చి, వాళ్లకంఠాలను బలంగా తాకింది. ఆ దెబ్బకు వాళ్లిద్దరూ దిమ్మెరపోయి, కుయ్ మనేందుకు కూడా శక్తిలేక, ఏనుగు మీది నుంచి దభీమంటూ కింద రాళ్లమీద పడిపోయారు. ఆ మరుక్షణం పైనుంచి వికటాట్టహాసం. మరికొన్ని బండరాళ్లు గురిగా వాళ్ల శిరస్సుల మీద పడినై. అంగరక్షకులు తలలు పగిలి ప్రాణాలు వదిలారు.

ఆ మరుక్షణం 'రాహుకేతు వంశాలు నశించాలి' అంటూ పొట్టి రాక్షసుడు, రాళ్ల చాటు నుంచి లేచి నిలబడి, రాతి లంగరును గాలిలో గిరగిరా తిప్పసాగాడు. అతడి పక్కన, వాడి ఆటవిక భార్య వెనక్కు తిరిగి చప్పట్లు చరిచి చేతులూపసాగింది. కాసేపట్లో కుంతల దేశ మంత్రి గంగాధరుడు కొద్ది పరివారంతో పొట్టి రాక్షసుడి దగ్గిరకు వచ్చాడు. రాక్షసుడాయనకు మహాకలి దాగి ఉన్న గుహచూపించి, ఆ ప్రాంతానికి పరుగున వస్తున్న మాంత్రికుడు కాలశంబరుణ్ణీ, అతడి అనుచరుల్నీ తొందరగా రావలసిందని హెచ్చరిస్తూ కేకలు ప్రారంభించాడు.

కాసేపటిలో మాంత్రికుడూ, శశికాంతుడూ, కుంభీరుడూ గుహల దగ్గిరకు వచ్చారు. మంత్రి గంగాధరుడు కొండ దిగివచ్చి, తన కుమారుణ్ణి కౌగలించుకుని ఆనంద భాష్పాలు రాలుస్తూ, ''శశీ! నువ్వు బతికే ఉన్నావని మొదటినుంచి నాకు గట్టి నమ్మకం ఉన్నది.



ఈ పొట్టి రాక్షసుడు మూడు నెలల క్రితం మన రాజ్యం వచ్చి, పాతాళదుర్గాన్ని గురించిన అన్ని రహస్యాలూ చెప్పేశాడు. నేను కొద్ది పాటి సేనతో బయలుదేరి వారంరోజుల క్రితమే ఈ ప్రాంతాలు చేరాను. పాతాళదుర్గం సర్వనాశనమవటం కళ్లారా చూశాను. శుభం. రాకుమారి కాంతిసేన ఎక్కడ'' అని అడిగాడు.

కాంతిసేనా, భామాసింగీ కొంచెం ఆలస్యంగా అక్కడికి వచ్చి చేరారు. మంత్రి గంగాధరుడు రాకుమారికి, ఆమె తండ్రి ఉగ్రసేనుడి క్షేమవార్తలు చెప్పి, ''కదంబ రాజ్యం చేరిన మరుక్షణం నిన్ను రాణీగా అంగీకరించేందుకు ప్రజలు సిద్ధంగా ఉన్నారు. ఆ తరువాత నీవు వరించిన వ్యక్తి కదంబరాజవుతాడు'' అని చెప్పాడు. ''ఇంకా వరించటమా? శశికాంతుడూ, రాకుమారీ ఏనాడో ఒకర్నొకరు



ప్రేమించుకుని వివాహం ఆడేశారు. నేను ఆమెను దొంగిలించుకు వచ్చేటప్పుడు చేసిన వాగ్దానం నెరవేర్చుకున్నాను. అవునా రాకు మారీ?'' అని ప్రశ్నించాడు కుంభీరుడు.

కాంతిసేన ఆ మాటలకు సిగ్గుపడి తలవంచుకున్నది. కాలశంబరుడు మంత్రి గంగాధరుడి ముందుకు వచ్చి ''మహామంత్రీ! అంతా శుభప్రదంగానే ముగిసింది. ధూమక, సోమకులు చేసిన సాయాన్ని మరిచిపోకండి. భద్రుడు ఎలానూ మీవాడే. పోతే నేను కుంభీరుడికి చేసిన వాగ్దానం ప్రకారం అతణ్ణి ఈ ప్రాంతాలకు రాజునుచేసి నా దారిననేను మహాకాళి నర్చించేందుకు కొండల్లోకిపోతాను,'' అని చెప్పి పొట్టి రాక్షసుణ్ణి, ''ఆ దుర్మార్గుడు మహాకలి దాగినగుహ ఏది?'' అని ప్రశ్నించాడు.

పొట్టిరాక్షసుడు గుహను చూపించాడు. మాంత్రికుడు గుహ ముందుకు పోయి మంత్రదండాన్ని పైకెత్తి, ''మహాకలీ, బయటకిరా, నీ చావు సమీపించింది. నాతో ద్వంద్వ యుద్ధానికి రా, నువ్వు నన్ను జయించావో, నీ ఇష్టం వచ్చిన చోటుకు పోయేందుకు, నా వాళ్లెవరూ అడ్డు తగలరు,'' అని కేకవేశాడు. మరుక్షణం మహాకలి గద భుజాన పెట్టుకుని గుహ నుంచి బయటకు వస్తూ, ''అలా అయితే మనం ధర్మయుద్ధం చేద్దాం, ఏనుగును గుహలోనే వదిలి వచ్చాను. కాచుకో!'' అంటూ మాంత్రికుడి మీదికి లంఘించాడు.

కాలశంబరుడు, అతడి దెబ్బను మంత్రదండంతో కాచుకుని, ''పాపీ! ముందే చెబుతున్నాను నువ్వు దొంగ చాటుగా మీదపడి తల నరికి చంపిన నా తండ్రిది, ఈ మంత్రదండం. ఇది నీ శరీరాన్ని తాకితే, నీటి బుడగలా పేలిపోతావు. ఇక చూపించు నీ గదావిద్యా ప్రావీణ్యం,'' అంటూ ముందుకురికాడు.

మాంత్రికుడిలా అనేసరికి మహాకలి నిర్విణ్ణుడై, భయంతో వణికిపోతూ, మంత్రదండం దెబ్బలను గదతో కాచుకుంటూ, ఒక్కొక్క అడుగే వెనక్కు వేయసాగాడు. కాని, కాలశంబరుడు, మహాకలికి పారిపోయే అవకాశం ఇవ్వకుండా, మీదిమీదికి దూకుతూ, అతడు బాగా అలిసిపోయినట్లు కనబడగానే, పాపీ, యిక చావు! అంటూ ఎడం చేత్తో గదను పట్టుకులాగి మంత్రదండంతో అతడి గుండెల్లో పొడిచాడు. ఆ వెంటనే కళ్లను మిరుమిట్లు గొల్పేలాంటి కాంతీ, చెవులు దిబ్బెళ్లు పడేటంత ధ్వనీ ఒకేసారి పుట్టింది. మహాకలి



Thursday గురువారం ଗୁରୁବାର Oriya గురుబార

శరీరం చిన్నాభిన్నమై అంత ఎత్తున గాలిలోకి లేచిపోయింది.

అందరూ కాలశంబరుడికి జయజయ ధ్వానాలు చేశారు. మాంత్రికుడు, మహాకలి గదను కుంభీరుడికి ఇస్తూ, "కుంభీరా! నువ్వు దండకారణ్యానికి రాజువు. పాతాళ దుర్గం ఇంకా ఏమైనా మిగిలి ఉంటే దానికి అధిపతివి," అన్నాడు. కొండ మీది సరోవర జలం కింది పాతాళదుర్గం మీదికి ప్రవహించ కుండా ఆపవలసిందిగా ప్రార్థిస్తున్నాను." అన్నాడు కుంభీరుడు, మాంత్రికుడికి నమ స్కరిస్తూ, "ఆ పని ఈ రాత్రే చేస్తాను. తిరిగి బండరాయిని యథాస్థానంలో పెడితే ప్రవా హం కట్టుబడి పోతుంది. భయపడకు," అన్నాడు కాలశంబరుడు.

ఆ సాయంకాలం మంత్రి గంగాధరుడి పరివారం, కుంభీరుడి అనుచరులూ విందు వినోదాలతో హాయిగా గడిపేశారు. గంగాధ రుడు రెండు రోజులపాటు మాంత్రికుడికి, కుంభీరుడికీ అతిథిగా వుండి శశికాంతుడూ, కాంతిసేనా, పరివారం వెంటరాగా కుంతల దేశా నికి బయలు దేరాడు. అందరూ ప్రయాణం అయి పోయేటప్పుడు కుంభీరుడు, విరూ పుణ్ణి పక్కకు పిలిచి, "భామాసింగి జాగ్రత్త. అది మహాకలి మీద మోహపడి ఆఖరు క్షణంలో పాతాళదుర్గం వదలనని మొండి కెత్తింది. నోరు మూసి బలవంతంగా భుజాన వేసుకుని బయటకు లాక్కొచ్చాను. దాన్ని భిల్లనాయకుడు పులిందుడికి ఒప్పచెప్పక పోయావో, నీకూ అతడికి బతికున్నన్నాళ్లూ పోరు తప్పదు," అని సలహా ఇచ్చాడు.

"అది వాడి పదో పడచుపెళ్లాం. ఎలా అయినా సరే, అతగాడికి ఒప్పచెప్పుతాను. ఈ జరిగిపోయిన గలాభాలో, నా నల్లగరుడుడు దారి తప్పి ఎటో ఎగిరిపోయాడు," అన్నాడు విరూపుడు విచారంగా. "దాన్ని ఈ కొండల్లో ఎక్కడున్నా వెతికి పట్టుకుని, నీకు పంపు తాను సరేనా?" అంటూ కుంభీరుడు, విరూ పుడి నడుం పట్టుకుని గిరగిరా తిప్పి కింద దించాడు. "అహ్హా, శాంభవీ! నువ్వు రాక్షసుడి వన్న మాటే మరిచానుసుమా!" అంటూ విరూ పుడు పెద్దగా నవ్వి, చాలా దూరం ముందుకు పోయిన తనవాళ్లను కలుసుకునేందుకు పరిగెత్తాడు. – అయిపోయింది.





Thursday గురువారం ગુરુવાર Gujarati గురువార్

# పునరాగమనం

[సప్తవర్ణ శోభిత సముద్రం నా కళ్ళముందు కనిపించింది. తలలు, తోకలు, కాళ్ళు, పళ్ళు. అనంతమైన దృశ్యం. కళ్ళు... వేలాది జంతువుల కళ్ళు. సూర్యకాంతిలో మెరుస్తున్నాయి. వేచి చూస్తున్నాయి, పరిశీలిస్తున్నాయి. నాకోసం వేచిచూస్తున్నాయి. -తరవాత]

నిస్పృహతో, నేను చైనా ఏనుగు సహాయంతో చెట్టునుంచి దిగాను. దాంతో మాట్లాడుతూ, నిటారుగా నిలబడ్డాను. నా ఉద్వేగాన్ని అణచుకుని పథకం ప్రకారం ముందుకు సాగవలసిందిగా మా తాతయ్య ఇచ్చిన సలహాను ఒకవైపు పాటించాలి. మరోవైపు పేరుకుపోయిన పురాతన ప్రతీకారాలను మనసులో ఉంచుకున్న జంతు సముద్రాన్ని ఎదుర్కోవాలి.

''మనం ముందుకు అడుగేద్దామా'' మెల్లగా నవ్వుతూ చైనా ఏనుగుతో చెప్పాను. ''నేను..'' అంటూ సన్నగా గొణిగాను. నా పొట్టలో వికారంగా ఉంది. ''రారా.. ఇదీ ఓ ఆటలా ఉండబోతోంది! ప్రపంచం మొత్తం ఓ నాటకరంగం!'' అది వినోదంగా నవ్వింది. నేను ఇంకా సమాధానం ఇవ్వకముందే, దాని తొండంతో నా కాళ్లను పైకి లేపి వీపుపై కూర్చుండబెట్టుకుంది.

వేం ముందుకు పోతున్నాం. నా కళ్లు గట్టిగా మూసుకున్నా. నాలో పిరికితనం ప్రవేశించినట్లుంది. పారిపోవడం.. పారిపోవడం ద్వారా దేన్నీ ఎదుర్కోకపోవడం.. ఇది తప్ప ప్రస్తుతం నాలో ఏ ఆలోచనా లేదు. భేరీ ధ్వని రానురానూ మరింత పెద్దదవుతోంది. తర్వాత... మృత్యు శీతల నిశ్శబ్దం. ''మానవుడొచ్చాడు.'' మయూరి ఉచ్ఛస్వరాన్ని, భావరహిత స్వరాన్ని విన్నాను.''అతడిని కిందికి దించండి ఆ నిశ్శబ్ద వాతావరణంలో ఓ వికృత స్వరం ఉరిమింది.



"ఇప్పటికే అతడు మనలో ఒకరిపై రాజు లాగా కూర్చున్నాడు చూడండి'' నిస్సందేహంగా ఆ స్వరం నైలునది మొసలిదే.

బలవంతంగా కళ్లు తెరిచి చూశాను. దిగ్భ్రాంతితో చైనా ఏనుగుపైనుంచి దిగాను. ఎలాంటి దుస్థితిని ఎదుర్కోవడానికయినా నేను సిద్ధపడిపోయాను. నా మెదడులో రేగిన తొలి భావం ఏదంటే ఒక్కసారిగా అరిచేశాను "వావ్!''

నాముందు, విస్తరించిన మహా జీవితం, వైవిధ్యపూరితమైన, అనంతమైన, సజీవమైన జీవితం.. అదొక దివ్యమైన క్షణం. జంతు సామ్రాజ్యంతో పరిచయం.. నాలో ఓ మహదానుభూతి. మానవులకు, జంతువులకు మధ్య ఏర్పడిన దూరం అనేక సంవత్సరాలుగా నన్ను తొలుస్తూ వచ్చింది. మానవుల ఆధిక్యత, వైభవోజ్వల నాగరికత, ఇవన్నీ మృదు సర్పాల లాగా జారిపోయాయి. నేనో జంతువును. ఇవి నాకు సంబంధించినవి. నేనూ వారిలో ఒకరిని.

నా ముఖంలో ప్రతిఫలించిన సంతోషానుభూతి నా ముందు ఉన్న జంతుప్రపంచాన్ని చూడగానే కరిగిపోయింది.

వాడికొమ్ములు కలిగిన అతి పెద్ద జంతువు (ఇదొక చరిత్ర పూర్వయుగపు మహా వృషభం కాబోలు) ఆ సమూహంలోంచి ముందుకొచ్చింది. అది మయూరి పక్కన నిశ్శబ్దంగా నిలబడింది. దాని పొడవాటి ముక్కురంధ్రాలను పరికించాను. ఇక్కడ శక్తి గురించి తెలిసిన ప్రాణి ఉంది. తన కాలంలో అది తన పాదాన్ని పై కప్పుమీద ఆనించడం ద్వారా ఓ పెద్ద ఇల్లునే కూలదోసి ఉంటుంది. దాని పట్ల గౌరవసూచకంగా తల కిందికి వంచాలన్న అనుభూతి.



"ముందు నువ్వే వెళ్లాలనుకుంటున్నావా?'' మయూరి ఆ వృషభరాజాన్ని అడిగింది. దాని అర్థమేమిటో నాకు బోధపడలేదు. వెళ్లు అంటే తన వాడి కొమ్ములను నాలో దింపాలనా అర్థం? అయితే అది మంచి వార్త కాదు. అది ఏమాత్రం మంచి వార్త కాదు.

"మయూరీ'' చెప్పాను. భయంకరమైన నిశ్శబ్దం అలుముకుంది. ఆమె మెల్లగా నా వైపు తిరిగింది. ఆమె కళ్లు మెరుస్తున్నాయి. నన్ను మాట్లాడొద్దని ఆమె ముందే నన్ను హెచ్చరించింది. అయినా మాట్లాడినందుకు ఆమె నన్నో పిచ్చివాడిగా భావిస్తున్నట్లు ఆమె ముఖకవళికలు చెబుతున్నాయి.

నైలు మొసలి తన కోరలు తెరిచి ఏదో చెప్పబోయింది... మయూరితో మాట్లాడినందుకు నిస్సందేహంగా అది నన్ను అభిశంసించదలి



| | | | | | |
|---|---|---|---|---|---|
| Thursday | గురువారం | വ്യാഴം | Malayalam | వ్యాళమ్ |



''అలా చెప్పమని ఎవరు బోధించారు.''

''ఎవరూ చెప్పలేదు. నా తప్పు ఎంత ఘోరమైందో నాకు తెలుసు'' నేను ప్రశాంతంగా జవాబిచ్చాను. ఉన్నట్లుండి ఆమె నవ్వింది.

''నిందితుడు తన నేరాన్ని అంగీకరించాడు. న్యాయస్థానం ఏం చెబుతుంది?'' ఏనుగు, నైలు మొసలి, సింధునది డాల్ఫిన్‌గా నేను భావిస్తున్న రాంగ్లర్‌ల వైపు చూస్తూ ఆమె అడిగింది. అది సమూహానికి పక్కనున్న పెద్ద గ్లాస్ తటాకంలో పడుకుని ఉంది.

''అవును'' ఆశ్చర్యంగా చెప్పాను. నేను భయపడలేదు.

''అయితే మనం అతడి అపరాథం పట్ల ఓ అంగీకారానికి రావాల్సి ఉంటుంది.'' నైలు మొసలి రెచ్చిపోయింది.

''అందరికంటే నువ్వే అతడి అపరాథం పట్ల సమాధానపడ్డావని నేననుకుంటున్నా'' మయూరి చల్లగా అడిగింది.

నేను.. మొసలి తడబడింది. దాని వంకర నేత్రాలు ఓ క్షణ కాలం కొట్టుకున్నాయి. అయితే ఇక్కడున్న ప్రతి ఒక్కరూ సమాధానపడ్డారని నేను చెప్పలేను.

''అభ్యంతరాలు లేవనెత్తదల్చుకున్నవారు ఎవరు?'' మయూరి ప్రశ్నించింది. వారిలో వారు గొణుక్కోవడం మొదలెట్టారు.

అక్కడ స్పష్టాస్పష్టంగా అలజడి అలుముకుంది. కొన్ని ప్రాణులు వాస్తవానికి నన్ను తప్పు పట్టదలిచాయా? అవి నన్ను శిక్షించాలని భావించడం లేదు కదా? అనునిర్వలో నా

చినట్లుంది. అయితే వేగంగా తేరుకున్నాను. మొసలివైపు తిరిగి చెప్పాను.

''మనం విధేయతను రేపటి కోసం ఆదా చేద్దాం.'' మయూరి పెదవి కొసలు ఆనందంతో విరిసినట్లు నాకనిపించింది. అయితే అది క్షణ కాలం మాత్రమే. ఆమె సూటిగా నా కేసి చూసింది. ''మానవుడా మాట్లాడు,'' చెప్పింది.

''నా పాపాల పట్ల విచారపడుతున్నా'' ప్రశాంత స్వరంతో చెప్పాను. నా స్వరం ఎలాంటి వణుకూ లేకుండా స్థిరంగా ఉంది. నా స్వరం ధ్వనించిన తీరుకు నాకే ఆశ్చర్యం వేసింది.

ఆమె తన కనుబొమలు అభినందనపూర్వకంగా ఎగురవేసింది. ''నీకు అలా చెప్పమని ఎవరు బోధించారు?'' ఆమె ప్రశ్నించింది.

''ఏంటీ?''

అనుభవాలనుంచి నేను విన్నదానికి, గుర్తుంచుకున్నదానికి ఇది భిన్నంగా కనిపిస్తోంది. పైగా, వారి తొట్రుపాటు చూస్తుంటే జంతు సమూహంలో అందరూ నన్ను వ్యతిరేకిస్తున్నట్లు కనిపించడం లేదు. దీంతో నా స్థైర్యం కాస్త పెరిగింది.

ఉన్నట్లుండి, గాల్లో ఏదో శబ్దం ప్రతిధ్వనించింది. ఓ తెల్ల సైబీరియా పులి. నేను ఆశ్చర్యంతో దానికేసి చూశాను. దాని జూలు, మచ్చలేనంత నాణ్యతతో ఉంది. పులులు మానవులను లెక్కచేయకుండా, వారిని తోసిరాజనే మహా సామర్థ్యంతో అది వేదికమీదికి వచ్చి మయూరి ఎదురుగా నిలబడింది. అది బలంగా శ్వాసపీలుస్తోంది. వేటాడుతూ మధ్యలో దాన్ని వదిలేసిన చందంగా అది రొప్పుతోంది. దాని నీలి కళ్లు స్థిరంగా, సముద్రాన్ని పోలి ఉన్నాయి.

"నేను చెబుతాను.'' అన్నది అది. దాని స్వరం హుందాగా ఉంది. దాని ముసలి స్వరంలో విజ్ఞానం ఉట్టిపడుతోంది. ఒక్కమాటలో చెప్పాలంటే దాని వ్యవహారాల్లో ఎవరూ వేలుపెట్టలేరు. విల్లులా వంగిన దాని వీపును చూస్తున్నప్పుడు నాకు ఈ భావవేం తట్టింది.

''ఏ ప్రాతిపదికన'' నైలు మొసలి తీక్షణ స్వరంతో అడిగింది. నువ్వు వేటాడబడి ఉండటమే నీకు అనుకూలాంశం అని భావిస్తున్నావా? మనం మాట్లాడుతున్నప్పుడు నీ చర్మం ఓ మనిషి ఇంట్లో తివాచీగా ఉపయోగపడుతుండటం నీకు గర్వకారణం కావచ్చు, ముసలి వికృత స్వరాన్ని పులి పట్టించుకోలేదు. అది మయూరికేసి ప్రశాంతంగా చూస్తూ, ''మనిషి శిక్షించబడవలసినప్పుడు మనం ఓటును తీసుకోవలసి ఉంటుందని నేను చెబుతున్నా'' అంది.

అది అనూహ్య ప్రతిపాదన. ఆ అద్భుత జంతువును నేను ఆసక్తిగా చూశాను.

''వ్యక్తుల మధ్య విశిష్టతలతో పని లేకుండా ప్రతి ప్రాణినీ మనుషులు కించపరచడమే మానవులతో సమస్య అని మనం అంగీకరిస్తూ ఉన్నట్లయితే, మనం అదే నేరానికి పాల్పడకూడదు.'' అన్నది పులి.

మొసలి దీర్ఘాలోచనలో పడి, ముడ్డిని నేలపై మోపి కూర్చుండిపోయింది. పులి తిరస్కార దృష్టితో మొసలిని చూస్తూ తోక ఊపింది.

''అనునిర్వలో అడుగుపెట్టిన మానవులను శిక్షించాలనే తీర్మానం పలు సంవత్సరాల క్రితం





పులి తన తలను ఊపింది. నా హయాంలో ప్రయత్నించాను. నాకు కొందరు మంచి మనుషులు తెలుసు. ఒక్క కుంచెతో జాతి మొత్తాన్ని తుడిచిపెట్టడం అన్యాయం అని నేను భావించాను.

"అతడు పట్టుబడి బందీగా వచ్చాడు!" గాల్లో బుస్సున ఓ స్వరం దూసుకొచ్చింది.

"అవును నేను వెళ్లాను. అయితే ఏంటీ?" పులి నిదానంగా చెప్పింది. "నా కోరల బలాన్ని చూడ దలిచి నట్లయితే ముందుకు రండి మరి."

"మానవులపై ఆధారపడి వచ్చిన జీవరూపాలకు మాట్లాడే హక్కులేదు!" మొసలి తేల్చి చెప్పింది. "స్వేచ్ఛగా ఉండటం వాటికి తెలీదు. అటవీ జీవితం తెలీదు."

"మాకు తెలీదా?" ఈసారి ఎద్దు అందు కుంది. మొసలి స్వరం చల్లబడింది.

"అడవిఎద్దు మానవులతోటే కలిసి జీవించా లని శపథం చేసింది." పులి చెప్పింది.

"అందుకని నేను వంగి నమస్కరించాలా?" ఎద్దు సకిలించింది.

"లేదు లేదు. నేనలా అనలేదు. అయితే నీవు మానవులపై ఆధారపడ్డ విషయాన్ని వ్యతిరేకించడం తెలివితక్కువ పని..."

"ఆపు" అడవి ఎద్దు రంకె వేసింది. "వాళ్ల ఆటలో నేనో పావునా! నేనతడికి రుణపడి ఉన్నానని నీవు చెప్పలేదూ!"

ఎద్దు పట్ల పులి విచారంగా చూసింది. తర్వాత తన తలను నెమ్మదిగా ఊపుతూ,

ఆమోదించబడింది. బహుశా పులిమర్చిపోయి వుంటుంది." మొసలి గొణిగింది.

"యుద్ధమండలిలో దాన్ని ఆమోదించారు. మనం సాధారణ ప్రాణులం.." పులి ఆగింది. అయితే అక్కడ చేరిన అశేష జంతుసమూ హంలో ఏ ఒక్కటీ పులి సాధారణ జంతువుగా తనను తాను అభివర్ణించుకోవడాన్ని ఆమో దిస్తున్నట్లులేదు... "మనకు దాంట్లో ఏ పాత్రా లేదు. పులి కొనసాగించింది."

ఒంటినిండా ఊలు కలిగిన మహా ఏనుగు ఉన్నట్లుండి అందుకుంది. "అయితే దాన్ని వెనక్కు తీసుకునేలా నువ్వు గట్టిగానే ప్రయ త్నించావు. మండలికి నువ్వు రావడం నేను మర్చిపోలేదు."



Friday శుక్రవారం शुक्रवार Hindi శుక్రవార్

మయూరి కేసి చూసింది.

''న్యాయమూర్తుల వారూ, మీ ప్రతిపాదన లేవి?'' మయూరి అడిగింది.

''మేం అతడి నేర జాబితాను రూపొందించాం. ఇక్కడున్న సభ్యులందరినీ ముందుకు వచ్చి అతడిపై నేరారోపణ చేసి శిక్షించవలసిందిగా మేం ఆహ్వానిస్తున్నాం. మనకు జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుకుందాం.''

''నాకు ఊపిరాడటం లేదు.'' కనురెప్ప ఆపకుండా పులి నిదానంగా న్యాయమండలి కేసి చూసింది.

అదన్నమాట విషయం.

నేను నా పిడికిలి బిగించి అన్నాను. ''నేను సిద్ధంగా ఉన్నా.''

ఆకాశం నుంచి ఓ కొత్త స్వరం వినిపించింది. రెక్కల సవ్వడి. పైకి చూశాను.

సూర్యకాంతికి అడ్డంగా నా కళ్లను ఆర్పిఆర్పి చూశాను. జంతువులూ అలాగే నిక్కినిక్కి చూశాయి.

మావైపు దూసుకు వస్తున్న ఓ నల్లటి చిన్న వర్తులాకారాన్ని చూశాం. అది పక్షా? అది విమానమా? అది అతీతమానవుడా?

అది.. ఓ అంతరిక్ష వాహక నౌక! ఆకాశం నుంచి మెరుస్తున్న ఎర్ర లైట్లు కిందికి దూసుకొచ్చాయి. ఇది.. వాహకులు తప్పించుకోవాలని ప్రయత్నించి కుప్పగూలిన రోదసీ నౌకల్లో ఒకటి కాదా? ఇదే జరిగినట్లయితే, మానవులు ఎలాగైనా సరే అంతరించక తప్పదు కాబట్టి, వారు తమకు తాముగా అనునిర్వకు రవాణా చేయబడతారని లెమన్, ఓమెన్‌లు చెప్పి ఉన్నారు మరి.

వాళ్లు వస్తున్నారు. పాములాంటి మయూరి మెత్తటి స్వరం నా చెవులకు తాకింది.

''వాళ్లు వస్తున్నారు'' నైలు మొసలినది చెప్పింది. ఆకుపచ్చగా ఉండే డొప్పలు ప్రమాదకరంగా మెరిశాయి.

''వాళ్లు వస్తున్నారు'' జంతువులన్నీ ఒక్కసారిగా అరిచాయి.

పసుపుపచ్చ భూగోళం వంటి రజతవర్ణ వృత్తాకార పాత్ర క్రమంగా మాటతప్పని చంద్రునిలా ఆకాశం నుంచి కిందికి దిగసాగింది.

నేను మానవులను ఎంతగా కోల్పోయానో అప్పుడు కానీ నాకు తెలియడం లేదు.

(ఇంకా ఉంది)

-సౌమ్యా రాజేంద్రన్



| Friday | శుక్రవారం | வெள்ளிக்கிழமை | Tamil | వెళ్లిక్ కిళమై |
|---|---|---|---|---|

# చందమామ కబుర్లు

## నీటి అడుగున అరుదైన కారు




కార్ల చరిత్రలో అరుదైన బ్రెస్కా బుగట్టి కారును స్విట్జర్లండ్‌లోని ఓ సరస్సు అడుగు భాగంలో ఈ మధ్యే కనుగొన్నారు. గత 73 ఏళ్లుగా ఇది నీటి అడుగున ఉండిపోయింది. 1936లో ఈ కారు యజమాని దిగుమతి పన్ను చెల్లించక పోవడంతో ఆగ్రహించిన ఓ స్విస్ అధికారి ఏకంగా కారునే నీటముంచేశాడు. పన్ను చెల్లింపు మొత్తం కంటే కారు విలువ తక్కువ. దాన్ని ధ్వంసం చేయడం మినహా ఆ కస్టమ్స్ అధికారికి మరో మార్గం లేక పోయింది. ఇటలీ సరిహద్దులోని మగియోర్ సరస్సుకు కారును తీసుకెళ్లి నీటి అడుగున ముంచేశారు. 73 ఏళ్ళ పాటు నీటి అడుగున ఉన్న నమూనా కారు టైర్లలో గాలి కూడా అలాగే ఉండటమే విశేషం.

## పిల్లల బోధనలో రోబోట్ చేప

జపాన్ సముద్ర జీవశాస్త్రజ్ఞుడు, విద్యావేత్త మసమిచి హయాషి విద్యపై సరికొత్త భావనను వృద్ధి చేశారు. దాని పేరు రోబోట్ ఫిష్. రీసైకిల్ చేసిన వస్తువులతో వంద కృత్రిమ చేపల బోట్లను దీని కోసం రూపొందించారు.

చేపల ఈతశైలులను వాటిని పోలిన రోబోట్లు అనుకరించి చూపుతాయి. దీని కోసం హయాషి 5 అడుగుల పొడవైన తాబేలును చరిత్రపూర్వ యుగానికి చెందిన ప్రత్యేక చేప ఆకారంలాగా మార్చారు. ఈ ఫిష్ బోట్లు రిమోట్ కంట్రోల్ ద్వారా నడుస్తాయి. కొన్ని సందర్భాలలో హయాషి రోబోట్ చేపల తయారీలో కొత్త పుంతలు తొక్కారు. వీటిలో కొన్ని పెద్ద చేప తరహా రోబోట్లు వాటి నోళ్లను తెరిచి మూయడమే కాకుండా కృత్రిమంగా భుజిస్తాయి కూడా. ఇది విజ్ఞానంలో వింత మలుపే కదూ!






Friday శుక్రవారం शुक्रवार Bengali শুক্রবার

# ఉదయ తారలు

- టీవీలో డ్రాగన్‌బాల్ జెడ్ షోని మీరు చూశారా? అయితే వెంకట రమణను మీరు చూసే ఉంటారు.

గెలుపొందిన అవార్డులు:

- క్రీడలలో ప్రోత్సాహ ఉగాది పురస్కార్ 2005 అవార్డు కైవశం.
- కేడెట్ బాయ్స్ విభాగంలో 2005 జాతీయ ఛాంపియన్‌షిప్ పోటీలలో రజిత పతకం.
- 2006లో కేడెట్ బాయ్స్ టీమ్ ఈవెంట్‌లో, టైయుంగ్ జూనియర్ అంతర్జాతీయ టోర్నమెంట్‌లో కంచుపతకం.
- ఇరాన్ లోని ఫజిర్ ఇంటర్నేషనల్‌లో జరిగిన కేడెట్ సింగిల్స్ పోటీలో రజతపతకం, డబుల్స్, టీమ్ ఈవెంట్‌లలో కంచుపతకం.
- వరుసగా నాలుగేళ్లపాటు స్టేట్ ఛాంపియన్‌షిప్ కైవసం.

## వెంకటరమణ



విశాఖపట్నం నుంచి వెలుగులోకి వస్తున్న టేబుల్ టెన్నిస్ స్టార్ ఆటగాడు వెంకట రమణ వయస్సు 15 సంవత్సరాలు మాత్రమే అయినా ఇప్పటికే దేశంలోని అగ్రశ్రేణి క్రీడాకారులలో ఒకడుగా గుర్తింపు పొందాడు. పదేళ్ళప్పుడు కేడెట్ బాయ్స్ జట్టు కెప్టెన్‌గా పనిచేశాడు. సోదరి ప్రణీత టేబుల్ టెన్నిస్ ఆడుతుంటే చూస్తూ వచ్చిన రమణ ఏడేళ్ల ప్రాయంలో ఈ ఆటపై మక్కువ పెంచుకుని ఆడటం ఆరంభించాడు.

ప్రతిరోజూ రెండుగంటల పాటు రమణ ఆట ప్రాక్టీస్ చేస్తుంటాడు. కోచ్‌లు తాతారావు, అశోక్ కర్మార్కర్, అచ్యుత్ కుమార్‌లతో పాటు తండ్రి వద్ద కూడా ఆటమెలకువలు తెలుసుకున్నాడు. ''ఆటల్లో, నాకు నాన్న కోచ్ అయితే చదువులో అమ్మ కోచ్‌గా ఉంటోంది'' అని రమణ చెప్పాడు. లిటిల్ ఏంజెల్ హైస్కూల్ అతడికి కొంతవరకు బాసటగా నిలిచింది. టోర్నమెంట్లలో పాల్గొనవలసినప్పుడల్లా రమణకు సెలవు మంజూరు చేశారు. కాగా, పరీక్షలకు సిద్ధం కావడంలో స్నేహితులు సహాయపడ్డారు.

''ఏ ఆటగాడిని కూడా తక్కువగా అంచనా వేయకూడదనే అంశం నేర్చుకున్నాను'' అని రమణ చెప్పాడు. భారతీయ టేబుల్ టెన్నిస్ క్రీడాకారులలో అగ్రగామిగా ఉన్న శరత్ కమల్ ఇతడికి ఆదర్శం. భవిష్యత్తుపట్ల రమణ గంపెడాశలు పెట్టుకుని ఉన్నాడు. ఐఐటీలో స్థానం సంపాదించాలని, టేబుల్ టెన్నిస్ ఆడటం కొనసాగించాలని అతడి కోరిక. అతడంటాడు. మీరు నిజంగా ఆటను ప్రేమిస్తున్నట్లయితే మీరు పూర్తి అంకితభావం ప్రదర్శించాల్సి ఉంటుంది!



Friday శుక్రవారం शुक्रवार Marathi శుక్రవార్



# నవ్వుల పువ్వులు



రోనక్ : కొత్తగా వెల్లుల్లి ఆహారంపై ప్రయోగం చేశా. మూడు పూటలూ నేను వెల్లుల్లి మాత్రమే తినాలి.
విశాల్ : మరి బరువేమైనా తగ్గావా?
రోనక్ : బరువు తగ్గలేదు కాని చాలామంది మిత్రులను కోల్పోయా.



అమ్మ : బడిలో తొలిరోజు ఏం నేర్చుకున్నావు నాన్నా?
కూతురు : ఏం నేర్చుకోలేదమ్మా
అమ్మ : సంఖ్యలు, అక్షరాలు నేర్చుకోలేదా?
కూతురు : అమ్మా నువ్వు చిన్నప్పుడు స్కూలుకెళ్లలేదా?



రోగి : డాక్టర్ మీరు నాకు సహాయం చేయాలి. చాలా ఒత్తిడిలోఉన్నా. ప్రజలతో వ్యవహరించేటప్పుడు నిగ్రహాన్ని కోల్పోతున్నాను.
డాక్టర్ : మీ సమస్యను చెప్పండి!
రోగి : ఇంతవరకు నేను చెప్పిందేమిట్రా వెధవా.

ఇద్దరు మనస్తత్వ శాస్త్రవేత్తలు ఇరవై ఏళ్ల తరవాత కలిశారు. వారిలో ముసలివాడు యువకుడిలా కనిపిస్తున్న అతడిని అడిగాడు. ''నీ జీవిత రహస్యం? జనం సమస్యలు వినీవినీ నేను ముసలాడినై పోయాను.'' యువకుడు వెంటనే అడిగాడు. ''విన్నదెవరు?''



## అల్లరి దత్తు









# ఊ! సిద్ధూ సాధించాడు ! మళ్ళీ!

గిల్డా ఆంటీ చిన్నారి సిద్ధార్థ్‌ను కొబ్బరికాయలోని పోషక పదార్థాల ఉపకారాలను వ్రాయమన్నది. సిద్ధూ వాటిని సేకరించాడు. ఆంటీకి మెలుకువ వచ్చేలోగా త్వరగా వాటిని పరిశీలించి, సరిచేద్దామా!

ERBFI

CARSETARDBOHY

SINATVIM

MIRANSELA

RPOENIT





పీచుపదార్థాలు, కార్బోహైడ్రేట్లు, విటమిన్లు, మొదలగునవి కలిగియున్న అద్భుతమైన కాణాచి, కొబ్బరికాయ. బలంగా, ఆరోగ్యంగా ఎదుగుటకు కావలసిన అన్ని గుణాలు కలిగియున్నది.




**Coconut Development Board**
(Ministry of Agriculture, Government of India)
cdbkochi@dataone.in, www.coconutboard.gov.in

